శ్రీకృష్ణ

# బొబ్బిలివారివంశావళి.






ఇది

శ్రీమద్బొబ్బిలిసంస్థాన ప్రస్తుతపరిపాలకులగు

మహారాజరాజశ్రీ

మహారాజా సాహెబు మెహర్బాన్ దోస్తాన్

మహారాజా

శ్రీరావు సర్ వేంకటశ్వేతాచలపతి రంగారావుబహాదరు

జి, సి, ఐ, ఇ. వారియాజ్ఞవలన



తదాస్థానవిద్వత్కవులగు

**మండలేముల సీతారామశాస్త్రిగారిచే**

రచియింపఁబడినది.

**1914.**

ఆనందముద్రణాలయ ముద్రితము.



శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ బొబ్బిలివారివంశావళి.



తారుణ్యవతీమణీ హృదయ రాజీవ్రోదయార్కుఁడు సం
ఖ్యాతీతాబ్జ భవాండ రక్షణ కళా వ్యాపారుఁడై యొప్పు న
జ్ఞాతాత్ముండు శుభాఢ్యుఁ జేయుతఁ గృపాంచద్దృష్టి శ్రీ వేంకట
శ్వేతాద్రీశ్వర రంగరాయ ధరణీభృన్మౌళి నశ్రాంతమున్. 1

మ. తన పార్శ్వంబుల రుక్మిణీసతియు సత్రాజిత్సుతారత్నమున్
దనరన్ బొబ్బిలిపట్టణంబునఁ గడున్ రాజిల్లు దివ్యాలయం
బున నిత్యార్చనలందుచున్ సుముఖుఁడై పొల్పొందు దేవుండు మా
జననాథాగ్రణి రంగరాయవిభునశ్రాంతమ్ము రక్షించుతన్. 2

శా. సీతాభోజనుతా మనఃకుముదినీ శీతాంశు లర్కాంబుజా
రాతిస్ఫీత కులావతీర్ణు లగు శ్రీరాముండు శ్రీకృష్ణుఁడున్
జేతః ప్రీతి యెలర్పఁ బ్రోతురు గుణశ్రీరమ్యు శ్రీవేంకట
శ్వేతాద్రీశ్వర రంగరాయ వసుధా సీమంతినీ నాయకున్. 3

క. అని యిటులేలిన భూనా
ధునకున్ సకలేష్టసిద్ధి దొరకొన మదిలో
ఘనభక్తిని దైవప్రా
ర్థన మొనరిఁచి కృతి రచింపఁదలఁచిన యంతన్. 4

శా. శ్రీతన్వీ రమణావతారుఁ డనఁగాఁ జెల్వొందు శ్రీవేంకట
శ్వేతాద్రీశ్వర రంగరాయ నృపతిశ్రేష్ఠుండువై దుష్య వి
ఖ్యాతానేక బుధోత్తముల్ కవులు ముఖ్యామాత్యులున్ బంధులున్
జేతః ప్రీతిని గొల్వఁగా సరస గోష్ఠిన్ గాలముం బుచ్చుచున్. 5

సీ. మండలేశులపద మండిత కౌండిన్య
గోత్రజు వేంకట గోవిద సుతు
సూర్యనారాయణ సూర్యుపదిష్ట స
త్కావ్య నాటక బోధ ఘను సుసూర్ల
వంశ్య సీతారామ వర గురుకరుణా స
మాగతన్యాయ వేదాంతబోధ
కలితు వేంకటరామకవి నృపభోపది
ష్టాంధ్రకవిత్వ మర్యాదుఁ బిత్రుపి
తే. తామహా నుసంప్రదాయాగత ప్రబంధ
పరిచయుఁ బురాణసంహితాభ్యాసు శబ్ద
శాస్త్ర పరిచితు సముచిత సాహితీ ధు
రీణు సుజనవిధేయు నాశ్రితుని నన్ను. 6
క. సీతారామ సమాహ్వయు
సీతారామ పద పద్మ సేవాయత్త
స్ఫీతాంతరంగుఁ గరుణా
శీతలముగఁ గాంచి పలికెఁ జిత్తమ్ములరన్. 7
సీ. కడుఁ బురాతనమయి వ్రాలు బొబ్బిలి రాజ్య
చరితంబు వ్రాయు నుత్సాహ మొదవి
దాని కాధారము లైన గ్రంథములను
బరికింప వానిలోపలను వంశ
పురుషక్రమంబును జరితాంశమును భిన్న
భిన్న విధమ్ముగ నున్నకతన
వాని శోధించి యేకోనవింశతి శత
తమమైన క్రైస్తవాబ్దంబునందు
తే. వ్రాసితిని జరితము నాంగ్లభాషయందుఁ
దదనుసారముగాఁగఁ బద్యమ్ముల సులభ
శైలితోఁదను దెలుఁగుభాష నొసరంగఁ

గూర్పవలె జుమ్ము నీదగు నేర్పు మెరసి. 8

క. అని యానతిచ్చిన నరేం
ద్రుని పలుకాలించి హర్షతోయధిలోన్
మునుఁగుచు మహాప్రసాదం
బని విన్నప మాచరించి యవ్విభునాజ్ఞన్. 9

క. నమకొంటి నిపుడు తచ్చరి
తముఁ బద్యాత్మకముగా యథామతిఁగూర్ప
సుముఖులయి యిందు మద్దో
షములను సయిరింతురుగాతఁ జదువరులు దయన్. 10

క. అమ్మను జేశుఁడు కూర్చిన
యమ్మహిత చరిత్రరాజ మాధారముగా
నిమ్మెయి వ్రాయఁగడఁగు గ్రం
థమ్మున కారంభ సంవిధాన మెటులనన్. 11

సీ. ఈరేడు జగముల నేరుపు మెయిఁజేయు
ధాతయెవ్వనిబొడ్డు తమ్మిబిడ్డ
జగముల వెలిగించు తొగదాయచుట్టంబు
లెవ్వాని కన్నులై యెపుడు వెలుఁగుఁ
గడుపున నెల్లజగమ్ముల నిమిడించు
నాకసం బెవ్వానికలరు నాభి
యెల్లర భరియించు నీ యిల యెవ్వాని
యడుగు దమ్ముల క్రింద నలరు పీట

తే. యతఁడు చెలువొందు వేల్పుల కాదిమూర్తి
స్వప్రకాశాత్ముఁడు నిఖిలవ్యాపకుండు
నన్నిటికిఁ బట్టు కొమ్మయై యలరు లోక
రక్షణ పరాయణుండు నారాయణుండు. 12

గీ. అమ్మహావిష్ణు దయకుఁ బాత్రమ్ములగుచు
డెబ్బదేడుగోత్రమ్ముల కీవి మెరయు

మానధను లైనయట్టి పద్మజకులంబు
వారు పొలుతురు భువి వెల్మవారనంగ. 13

క. అల డెబ్బదేడుగోత్రం
బులవారికి నాదిపీఠముగఁ బెక్కుతరం
బులనుండి గౌరవంబునఁ
బొలుతురు వేంకటగిరిప్రభువులు ప్రసిద్ధిన్. 14

చ. పటుతర నీతి కోవిదు లవార్య పరాక్రమ నిర్జితారిరాట్
కటకులు పండితప్రకర కల్ప మహీరుహ పంచశాఖు లు
త్కట కరుణాధురీణు లగుధారుణినాథవరేణ్యు లల్ల వేం
కటగిరి రాజవంశమునఁ గల్గి రనేకులు కీర్తిధుర్యులై. 15

వ. అందు. 16

సీ. అనపోతవిభుఁడు మహాపరాక్రమశాలి
గావునఁ దన శౌర్య కలనఁ జేసి
యాజి రంగముననుు రాజుల నోడించి
కృష్ణానదివరకు గెలిచి దేశ
మును దనకు నధీనముగఁ జేసికొనియె నిం
కొక పరిఁ బొసగిన యుద్ధమునను
దసు నెదిరించిన ఘను లగుదొరలను
నూటిపై నొక్కని గీటడంచి

తే. యేకవీరుం డటంచును నెన్నికఁగనె
వేంకటగిరి కుటుంబపుఁ బృథివిపతుల
లోన నారవపురుషుఁ డా మానఘనుఁడు
వెలమలకు నెల్లఁ గలిగించె విమలకీర్తి. 17

సీ సర్వజ్ఞ సింగయ జనపతి యెల్ల వి
ద్యలనేర్చి తనపేరు సార్థకముగఁ
బండిత కోటిచేఁ బలు కవీంద్రులచేతఁ
బరివేష్టితుండయి ప్రౌఢి మెరయ

విద్యావినోదియై వెలసెను సింగ భూ
పాలీయు మను పేరఁ బరగు గ్రంథ
ము రచించె సంస్కృతమునఁ బండితుం డని
కవి వరుం డనియును గాంచెఁ గీర్తి
తే. నతడు వేంకటగిరివంశమందు నుదయ
మందిన వసుంధరా వరులందు దశమ
పూరుషుం డయి జను లెన్నఁ బేరు వడసెఁ
దగదె యాతని వర్ణింప జగతియందు. 18
క. అల వేంకటగిరి పుర రా
జులలోఁ బదునేనవపురుషుం డగుచు మహిం
బొలిచెఁ బెదరాయఁ డాతఁడె
వెలసెను నిర్వాణరాయ విభుఁ డను పేరన్. 19
సీ. మొగలాయి ప్రభులకై పూని షేర్మహామదు
ఖానుం డనెడు పేరు గలిగిన సర
దారుఁ డీదేశమ్ము దా జయించుటకయి
వచ్చె నాతనితోఁడ వచ్చినట్టి
యిరువురు ప్రభులలో నీతఁ డొక్కరుఁ డయి
యుండెఁ దత్కాలపు యుద్ధములను
బలు సాయ మొనరించి పాదుషావలన రా
జా మనునట్టి సంస్థానముఁ బ్రతి
తే. ఫలముగనుఁ బొందె, రెండవప్రభువు విజయ
నగర రాజ్యము మొదటివాడుగ గణింపఁ
బడిన మాధవ వర్మయుఁ బుడమి రేడు
వీరిలోఁ బెద్దరాయ పృథ్వీవరునకు. 20
సీ. సంస్థానము నొసంగు సమయమ్మునందె వం
శక్రమమ్ముగను రాజాబహాదరు
మొదలైన బిరుదులు ముఖ్యమౌ తెల్ల జెం

డా నవుబత్తును ఢక్కయాది
గలిగినరాజ చిహ్నాలొసంగఁబడె నుత్త
రపు సరకారులం దపుడుపోరి
నందడి యడఁగ నా జనపతి కూడ వ
చ్చిన యట్టి లింగప్ప యను సుతునకు.
తే. దనకు సమకొన్న యీ రాజ్యమును నొసంగి
తండ్రి తాతలనాటి దై తనరెడు వెలు
గోడు రాజ్యమ్మునకును దాఁ గోరి చనియెఁ
బెద్దరాయ వసుంధరావిభుఁడు మరల. 21
చ. జనకుఁడు సమ్మదమ్మున నొసంగిన రాజ్యము నొంది లింగపా
వని విభుఁ డుండఁ బర్వతపుఁ బ్రాంతములందుఁ బితూరిఁ జేయు దు
ర్జనులను గండడంచుటకు సాయము గమ్మని యుప్డు దేశమే
లిన ప్రభు లప్పుడప్పు డల లింగమహీతలనాథుఁ గోరఁగన్. 22
ఉ. అమ్మనుజేశ్వరుండు దనకావసథంబుగ నీడ నొక్క దు
ర్గమ్మును దాని చెంతనె పురమ్మును దా రచియించి; వానికిన్
సమ్మతి పేర్మహమ్మదనుసాహెబు ప్రాపకుఁ డొాట వానినా
మమ్మొనరించె భూజనులు మానుగ బొబ్బిలియంచుఁ బిల్వఁగన్. 23
గీ. పేరనఁ దురుష్కభాషను జెలఁగును బులి
పెద్దపులి యను బడమయ్యె బెబ్బులియన
బెబ్బులియె నాఁడు నాటికి బొబ్బిలి యనఁ
బొలిచె నక్షరములు మార్పుఁబొంద నిపుడు. 24
క. ఆ లింగపరాయ మహీ
పాలుఁడు బస్తరు మొదలగు ప్రాంతములఁ బితూ
రీలవలని యలజడి ని
ర్మూలించెఁ గడింది శ్రమము పూని చేలమునన్. 25
గీ. పేరు మహామదుఖానుఁ డాతీరునను శ్రీ
కాకుళంపు సర్ లష్కరుకార్య భార

మును వహించుచునుండ నాతని సుతుండు
వేటకయి యొక్క యడవికి వెడలె నపుడు. 26

ఉ. గంజము మండలంబునను గ్రాలు పళాస సమీపభూమిలో
నం జెలువారు నొక్క గహనంబున నొప్పను రంగవాకయం
చుం జెలువారుచో టచటఁ జొప్పడియున్న పితూరికాఁడులోఁ
గొంజక యత్తురుష్కవిభు కూరిమిపుత్రుని బట్టె నుద్ధతిన్. 27

ఉ. దిట్టముగా వెదుర్పొదలు తీరిచి కట్టిన యట్టు లొప్పుచున్
జుట్టునెసంగుచున్న యలచోటు తురుష్కులదైన గుజ్జపున్
ధట్టికలోనఁ జొచ్చుటకుఁ దావు నొసంగకయుంటచే మదిన్
బుట్టిన వంత నయ్యవనభూపతి యేమియుఁదోప కయ్యెడన్. 28

ఉ. సాయము గమ్మటంచు నల సాహెబువేడఁగ లింగప క్షమా
నాయకుఁ డయ్యెడన్ బలమున న్గడిదేఁటినయాత్మ సేనతో
నా యటవీప్రదేశమున నవ్విధి నొప్పెడు రంగవాకకున్
బోయి విరోధు లున్నయెడ ముట్టడిచేసి కలంచి యుద్ధతిన్. 29

ఉ. ఒక్కదినంబు యుద్ధమున నుక్కఱి వానినిబట్టి వానిచేఁ
జిక్క నలంగినట్టి యలషేరుమహమ్మదుఃఖానుసూనునిన్
గ్రక్కున వీడఁజేసి యల రాజవరేణ్యుఁడు చింతచేఁ గడున్
స్రుక్కిన యా నవాబునకు సూనుని యప్పనచేసెఁ జేసినన్. 30

చ. క్షితిపతి యీగతిన్ దనకుఁ జేసినయప్రతిమోపకారమున్
మతిఁ దలపోసి యయ్యది జనంబులకెల్లను మేలటంచుఁ దాఁ
బ్రతిభదలిర్ప నంతయును వ్రాసెను సమ్మతిఁ బాదుషాకు నా
చతురుఁడు రాజవర్యునకుఁ జాల సిఫారసుగాఁగ నత్తరిన్. 31

సీ. ఇటు వ్రాయఁ బాదుషా యెంతయు ముదమంది
లింగప నరపాలపుంగవుండు
తన జమీందారిలోఁ దనరుచుండిన యెన్ని
గ్రామమ్ములకు నొకరాత్రి యందుఁ
దోరణమ్ములు సొంపుమీరఁ గట్టించునో

శాశ్వతంబగు మొఖాసాఁగ వాని
ననుభవించుటకునై యాజ్ఞనొసంగె నా
గతిఁ దోరణమ్ములు గట్టఁబడిన
తే. గ్రామముల్ పదిరెండయి గణనకెక్క
నవియె పోటుగ్రామములను సార్థకమగు
పేరఁ బిలువంగఁబడి జమీందారిలోన
నొప్పమీరుచు నున్నవి యిప్పటికిని. 32
ఉ. అప్పుడె పాదుషావలన నందెఁ గుటుంబపరంపరాక్రమం
బొప్పగ రంగరావనెడు నుజ్వలమౌ బిరు దాతఁ డద్దియే
యప్పటినుండి యీ కులమునందు జనించినయట్టి పూరుషుల్
తప్పక వారి నామము తుదన్ గదియింతురు ముఖ్యచిహ్నగాన్. 33
గీ. రంగవాకవిభుఁడు రణరంగమందు
గెలుపుకాఁడను నర్థముల్ దెలుపు రంగ
రాయ బిరుదిది యేలెడు రాజులకునె
కాక మగపేరులకునెల్లఁ గలదు తుదను. 34
క. ఆలింగప రంగ మహీ
పాలుఁడె హీరమండలంబుఁ బాలించెను భూ
పాలుని రణమున మరియొక
వేళను వధియించెననుచు వినఁబడుచుండున్. 35
గీ. ఆత్మజులు లేమిఁ గొనియెను నతఁడు వేంక
టగిరిరాజుల జ్ఞాతియై తగఁ బ్రసిద్ధుఁ
డైన మాధవరాయుని సూనులందు
దత్తునిగను వెంగలరాయ ధరణివరుని. 36
సీ. వెంగల రంగరాడ్విభుని బాల్యమునందె
లింగప నరపాల పుంగవుండు
కాలధర్మమునొందఁగాఁ గన్నతండ్రి మా
ధవరావు గొన్నినాళ్లవలఁ బెద్ద

యన్న పద్మారావు గొన్నినాళ్లును జిన్న
యన్న నారపరావు గొన్నినాళ్లు
సంస్థానకార్యముల్ సవరించి పిమ్మట
యుక్తవయస్సున నొప్పగింప
తే. నేరుపున రాజ్యతంత్రము నిర్వహించి
బ్రాహ్మణులకును నగ్రహారంబు లొసఁగి
చెఱువులను లోతు విరివియు మెఱయు వానిఁ
ద్రవ్వఁజేసెను వెంగలరంగవిభుఁడు. 37

గీ. అవియె యలరాజుయొక్కయు నతనిఁ గన్న
పెంచినట్టి తల్లిదండ్రులయును బేర నొప్పఁ
బద్మరావు నారపరావు వ్యవహరించు
తరిని దమ పేరఁ ద్రవ్వించి రిరుచెరువులు. 38

ఉ. వెంగలరంగరాయవిభు వెన్క సుతుండు మతాభిమానమొ
ప్పం గడు ధర్మశీలుఁ డన వాసికినెక్కిన మేటి సొంపు మీ
రంగను నేలె రంగపతి రంగనరేంద్రుఁడతండు గాంచె శ్రీ
రంగములోనుగాఁ గల పురాతనమై తగుక్షేత్రజాతమున్. 39

క. ఆ యవనీశుని తమ్ముం
డై యలరినయట్టి పెదజనార్దన రంగా
రాయమణికూర్చెఁ బ్రజ బలి
రా యన లకవరపుకోటరాజ్యముఁ గూడన్. 40

క. ఆరంగపతి నరేంద్రుని
గారాము తనూజుఁ డగుచు ఘనత వహించెన్
శ్రీ రాయడప్ప రంగ
క్ష్మారమణుం డతని బాల్యకాలమునందున్. 41

గీ. రంగపతి రంగనరపతి పుంగవుండు
కాలధర్మమునొందఁ దత్కాలమందుఁ
బెదజనార్దన రంగరాడ్విభుని జ్యేష్ఠ

సుతుఁడు లక్కవరపుకోట పతియునగుచు. 42

క. తనరిన వేంకటపతి రం
గనరేంద్రుఁడు గొన్ని నాళ్లుఁ గడపట నా రా
యనిసుతుఁడు జనార్దనరా
వును దీర్చిరి రాజకార్యపుం దంత్రమ్ముల్. 43

గీ. అంతటను యుక్తమైన వయస్సునంది
రాయడప రంగరాయ ధరావరుండు
నేరుపు సమర్థతయుఁ జాల నెగడుచుండఁ
బాలనము చేసె మహి బహువత్సరములు. 44

క. ఆ పుణ్యుఁ డిట్లు రాజ్య
వ్యాపారముఁ దీర్చి పుత్రవంతుఁడు గామిఁ
గోపాలకృష్ణ రంగ
క్ష్మాపాలకు దత్తపుత్రుఁగాఁ గావించెన్. 45

గీ. అట్టి గోపాలకృష్ణ రంగావనీంద్రుఁ
డలరు గోపాలరాయని యాత్మజుఁ డయి
యమ్మహీపతి కను జన్ముఁడై చెలంగె
రమ్యగుణశాలి వెంగలరాయ మౌళి. 46

సీ. శ్రీరావు గోపాలకృష్ణ రంగారాయ
విభుఁడు రాజ్యము నేలు వేళయందు
విజయనగర రాజ్యవిభుఁడైన పెద్ద వి
జయరామరాజను జనవిభుండు
పదునేడునూరులపయి నేబదింటిమీఁ
దను నేడవది యయి తనరు క్రైస్త
వాబ్దంబునను బుస్సియను ఫ్రెంచిసరదారుఁ
దనకుఁ దోడ్పాటుగ నొనరిచికొని

తే. బొబ్బిలిపురంబుఁ గోటను ముట్టడించె
నప్పు డభిమాన రక్షకై యమ్మహీశ

వరుఁడు ప్రాణంబుపయి నాస సరకుగొనక
చూపె సాహస ధైర్యముల్ చోద్యముగను.

క. పదియారునూటిపయి డె
బ్బదిపై నెనిమిదవ శాలివాహనశకమై
పొదలిన ధాత్రబ్దంబున
గదనము బొబ్బిలిని నడిచెఁ గడు నబ్బురమై.

గీ. ఘోరతరమైనయట్టి యీ పోరివలన
రావువారికి వా రేలు రాజ్యమునకు
వారి కులమున బుట్టినవారికెల్లఁ
గలిగెఁ బూర్వాధికం బగుఖ్యాతి జగతి.

క. నాటి యల యుద్ధపుం గథ
పాటలు పద్యంబు లగుచుఁ బలువిధముల నే
చోటులఁ బ్రసిద్ధిఁగనె నది
యేటికి వేరుగను జాటు నీ సమయమునన్.

గీ. వసుధ నిటు ఖ్యాతిఁగన్న గోపాలకృష్ణ
రంగరాయ మహీపతి పుంగవునకు
నాత్మసంభవుఁడగుచు నీయవని ఖ్యాతి
నెనసె వేంకటరంగ మహీవిభుండు.

సీ. తన తండ్రి యేయుద్ధమునఁ జంపఁబడియెనో
కడు ఘోరతరముగఁ గడచిన యల
బొబ్బిలి యుద్ధమ్ము పొసగునప్పుడు కుటుం
బము వారికెల్లను బాసిప్తమైన
గతినుండి జనకుని మతమునకు విరుద్ధ
మగునట్లు తత్సమయమున నొక్క
వృద్ధుని చే బహువిధములఁ గాపాడఁ
బడి ప్రాణరక్షను బడసి బ్రతికి

తే. నట్టి వేంకట రంగరాయావనీంద్రుఁ

డనఁగ గోపాలకృష్ణ మహీ కళత్ర
వర్యనికుటుంబమునను జీవరకునిలిచి
యున్న పూరుషవరుఁ డయి యొప్పుమీరి. 52

క. అలవేంకటరంగ మహీ
తలపతి రాజామునందుఁ దన బాల్యమునన్
నిలిచి కపటంపుఁ దలపునఁ
బిలిపింపఁగఁ జేర నరిగె విజయనగరమున్. 53

గీ. అరిగి యట వారు నిర్బంధపరుపనిలిచి
వారి కపటప్రయత్నముల్ నేరుపుమెయి
నెఱిగి వేంకటరంగ మహీవిభుండు
హైదరాబాదునకు నేగె ననువుమీర. 54

సీ. హైదరాబాదున కల్గిగి వేంకట
రంగ మహీపాల పుంగవుండు
నైజామువారిదైన యనుగ్రహమునకుఁ
బాత్రత నొందునప్పటికి దేశ
మాంగ్లేయుల యధీనమయ్యె నప్పటివారి
యధికారి యీయన నధిక గౌర
వమ్మునఁ బిలిపించి సమ్మతిఁ బితృ పితా
మహుల క్రమమ్మున మహితమైన

తే. రాజ్యము నొసంగె మరల నారాజమణికి
రాజ చిహ్నములన్నియుఁ బూజితముగ
నిచ్చి, యా భూమినాయకుఁ డేలె నారు
నొక్కసంవత్సరము రాజ్య మున్నతముగ. 55

సీ. హైదరాబాదున నటులుండి నైజాము
వారి యనుజ్ఞను బడసి దేశ
మున కేగుదెంచునప్పుడు పాగ డ్తను గన్న
గుజ్జంబు డంకాను గోమురు మిగుల

వేంకటరంగభూవిభునకు నైజాము
వారొసంగిరి దయ బహుమతిగను
నతఁడె యీ పురమునం దమరు దుర్గమ్మును
నిర్మించె నెంతయు నేర్పు మీర
తే. సది యొసంగును గోశాల లశ్వశాల
లమరు ధాన్యపుశాలలు నతి విశాల
రమ్య సౌధమ్ములును విచిత్ర గృహములును
గలిగి వైభవసంపత్తిఁ దెలుపుచుండి. 56
సీ. అతి విశాలం బయి యతి సమున్నత మయి
తనరారు నెయ్యది ఘనత మీర
దారుమయంబు లై తనరు గంబంబుల
వరుసచే నెయ్యది వన్నె మీరు
నుద్యోగులును రాష్ట్రియులును బల్ దెరగుల
ప్రజ లెప్పు డెచ్చట బలిసియుంద్రుఁ
సంస్థానకార్యముల్ సరవిఁ దీర్చుచుఁ బ్రథా
నోద్యోగు లెచ్చట నొప్పుచుంద్రు
తే. హైదరాబాదునందు నొప్పగు దివాను
ఖానలను బోలునట్టి దివానుఖాన
నబ్బురంబుగ నిర్మించె బొబ్బిలీ పు
రంపుఁ గోటను వేంకటరంగవిభుఁడు. 57
గీ. బొబ్బిలిని మున్ను జరిగిన పోరివలన
నెంతయును శిథిలత్వము నెనయు వెలమ
వారి మొదలింటి వైనయాఽచారములను
నిలిపె నప్పటిభంగి నా నృపవరుండు. 58
సీ. తన కరాగ్రస్ఫురత్కౌక్షేయకప్రభల్
పరిపంథినృపుల దర్పం బడంపఁ
దన వితరణ సముద్భవ హేమవర్షంబు

యాచకక్షామంబు నపనయింపఁ
దన దండనీతి సంజనిత భానుచ్ఛవు
లన్యాయ తిమిర సంహతి నడంపఁ
దన సమున్నత వసుధాపాలనస్ఫూర్తి
వర్ణాశ్రమోపద్రవము నడంపఁ
తే. గవులు దప్పక నొప్పించి కరము గొనక
తగని దండం బొనర్పక ధర్మమార్గ
మించుకేనియుఁ దప్పక యేలె రాజ్య
మంగజాకృతి వేంకటరంగనృపతి. 59

సీ. వేంకటరంగరాడ్విభుని రాజ్యపుఁ గాల
మారింటిపై నొక యబ్దమైన
నంతలోనన యాతఁ డగ్రహారమ్ము ల
నేకమ్ములొసఁగె మహీసురులకు
ఫలవృక్షము లనేకములు గల్గి విలసిల్లు
తోటలు వేయించె సూటిమీరఁ
గొదలేక యేవేళ నుదకపూరితము లౌ
చెరువులు చేయించె విరివి మెరయ
తే. మరియు నీరీతిఁ బెక్కు ధర్మము లొనర్చి
నిలిపె నెప్పటియట్ల బొబ్బిలిపురంపు
రాజ్యమును బెక్కుఁ దెరఁగుల శ్రమమునొంది
రాజమాత్రుండె వేంకటరంగవిభుఁడు. 60

గీ. పుత్రవంతుఁడుగామి నాభూవరుండు
బొబ్బిలి కుటుంబశాఖయై పొలుచు పాల
తేరుకా పురమగు రావువారియింట
జననమొందిన ఘను దత్తతనయుఁ జేసె
రాయడప రంగనరపాలు రమ్యశీలు. 61

సీ. శ్రీ రాయడప్ప రంగారాయ నరపతి

పదియేడునూరులపయిని దొంబ
దవహూణ శక వర్షమందు జననమంది
పదుమూఁడు వర్షముల్ ప్రాయము దన
కగుడు వేంకటరంగ జగతీపతికి దత్త
తనయుండగుచుఁ బదునెనిమిది శత
ములపైఁ దృతీయాబ్దమునఁ బదియవనెల
నిరువదియొకటవ వరదినమున
తే. శాశ్వతపుఁ గౌలు గొనియె సంస్థానమునకు
నిండియాదేశమెల్ల నఖండమహిమ
నేలుచుఁ బ్రభుత్వమునఁ జాల నెసఁగు బ్రిటిషు
దొరతనమువారివలనను గరిమ మెరయ. 62
ఉ. అమ్మనుజేశ్వరుండు వసుధామరకోటికిఁ బెక్కు లగ్రహా
రమ్ము లొనర్చి బొబ్బిలిపురమ్మున రాజమునందు నన్నస
త్రమ్ములు నాల్గుజాతుల కుదార మనస్కత నిల్పి ధర్మకా
ర్యమ్ము లనేకముల్ సలిపి ఖ్యాతి యొసంగఁగ నేలె రాజ్యమున్. 63
మ. ఘనుఁ డా భూపవరుండు భక్తియొసగంగా వేణుగోపాల దే
వున కీ బొబ్బిలిపట్టణమ్మునఁ గడుం బొల్పారు దివ్యాలయం
బును నిర్మింపఁగఁ బూని తద్రచనసంపూర్ణత్వముం బొందులో
ననె యీలోకము వాసి కైకొనియె శ్రీ నారాయణస్థానమున్. 64
క. జననుతుఁ డా నరపతి కొని
యెను ప్రగయమునకుం గరాడ యెస్టేటును నం
బనవలస యనెడి పేరఁ
ఘనతరముగ వన్నెగన్న గ్రామముఁ గూడన్. 65
గీ. కాశియాత్రఁ జేసి గంగ కావడిఁ దెచ్చి
నట్టివానికెల్ల నమ్మహీశుఁ
డొసగుచుండె భక్తి నొక్కొకరూప్యము
నిప్పటికిని నట్టు లీయఁబడును. 66

చ. అవయవలోపముల్ గదిరి యందునఁ జేసి స్వతంత్రజీవన
మ్ము వదయఁ జాలనట్టి జనముల్ దన వీటికి రాఁగ లుప్తమా
నవయవ మొక్కటొక్కటికి నాడట నొక్కొక రూప్య మిచ్చు న
య్యవనివిభుండు తత్క్రియ మొకింతయుఁ దప్పదు నేటి కియ్యెడన్.

క. శ్రీ రాయడప్ప రంగ
త్సారమణుఁడు నిత్య మొక్క సాలగ్రామం
బారఁగ దాన మొసంగు ను
దారత వేదవిదుఁ డైనధరణీసురునకున్. 68

క. ఏకాదశీవ్రతం బా
భూకాంతుడు నియమపూర్వముగ సలుపుచుఁ దా
శ్రీకాంతుని రుక్మాంగద
భూకాంతుని రీతిఁ దనిపి పొందె సుకృతమున్. 69

క. చవి మెరిగియుఁ బలభక్షణ
ము వర్జనము నేత యధిక పుణ్యంబని య
య్యవనిపతి మాంసభక్షణ
మువిడిచి వర్తించె నియమపూర్వముగాఁగన్. 70

గీ. 'ఆత్మవత్సర్వభూతాని' యనెడు శాస్త్ర
వచనమును బాటిచేసి యవ్వసుమతీశుఁ
డట్టిజంతువులకుహాని పుట్టకుండఁ
బట్టి యెల్లప్పుడును గనిపెట్టుచుండె. 71

క. ఆపన్నసంగమవలస
భూపతి నిశ్శంకనృపతి మును గరుణ మెయిన్
గాపాడెను రాయడప
క్ష్మాపాలవరుండు కొంత కాలము దనుకన్. 72

చ. పురమున వేదశాస్త్రములు పూర్ణముగాఁగ నెఱింగినట్టి స
త్పురుషులనుంచి వారికిఁ బ్రభూతసుఖస్థితినిచ్చి వారిచే
నిరత మనేకవిద్యల ననేకులు నేరుచునట్లు లక్ష్మిహి

వరుఁ డొనరించె విద్యలకు వానముగాఁ బుర మొప్పునట్లుగన్. 73

సీ. అమ్మహీపతి కుదయమ్మైరి శ్వేతాచ
లపతి రంగారాయ నృపతియును జ
నార్దన రంగరాయపతి సీతారామ
చంద్ర రంగారాయ జనవిభుండు
వేంకట రంగరాయాంక ప్రభుండు నా
నలరు నాత్మజులు సమస్తసుగుణ
గణములఁ బూర్ణులు కమనీయ రూపు ల
య్యాత్మజుల్ దనుఁ గొల్వ నతఁడు రాజ్య

తే. మేలి క్రీస్తుశకము పదునెనిమిది శత
ములపయిని ముప్పదవదయి పొలుచు వత్స
రమ్ము జనవరి యనెడుమాసమ్ము పదియు
నేడవదినమ్ము వైకుంఠ మెలమిఁ గొనియె. 74

క. ఖ్యాతుండగు రాయడప
త్మాతలనాథుండు విష్ణు సదనముఁ జేరన్
శ్వేతాచలపతి రంగ ధ
రాతలపతి పూనె నపుడు రాజ్యభరమ్మున్. 75

క. పదునెనిమిది వందలపైఁ
బదియవ వత్సర మగస్టు పది యేనవనాఁ
డుదయించి యీ నృపతి ము
ప్పది రెండబ్దములు పృథివి పరిపాలించెన్. 76

ఉ. అమ్మహితాత్ముఁ డిర్వదవ యబ్దమునందె యథోక్తరీతి రా
జ్యమ్మున కేగుదెంచి యనుమంతయు న్యాయము దప్పకేలి స
త్రమ్ములులోనుగాఁ దనదు తండ్రి యొనర్చినయట్టి ధర్మకా
ర్యమ్ములు వృద్ధినొందునటు లన్నివిధమ్ములఁ జేసెఁ బ్రాజ్ఞతన్. 77

సీ. చిరకీర్తియైన శ్రీ శ్వేతాచలాధీశ
రంగరాయ నృపాల పుంగవుండు

జనకుని యుద్దేశమును నెరవేర్చుట
తనకును విధి యైనపని యగుటను
రాయడప్పాసీ రమణుండు గట్టింప
మును బ్రీతితోడను మొదలుచేసి
నట్టి యాలయము సమగ్రముగాఁగ ని
ర్మించి మించిన భక్తి మెరయు నందు
శ్రీవేణుగోపాల కృష్ణదేవుని రుక్మి
ణీ సత్యభామలతో సమేత
తే. ముగను బదునెనిమిది శతములకుమీద
ముప్పదేడవళకవర్షమునఁ బ్రతిష్ఠ
నలిపి పదివేలరూప్యముల్ సాగవత్స
రమ్మునకు వచ్చు భూము లర్పణముచేసె. 78
శా. శ్వేతాద్రీశ్వర రంగరాయ వసుధా సీమంతినీ నాయకుం
డేతద్రాజ్యములోనఁ జేరినదియై యేపారుచున్నట్టి శ్రీ
సీతారామపురిన్ బ్రతిష్ఠగని సుశ్రీమీరుచున్నట్టి శ్రీ
సీతారాములకున్ సమర్పణము చేసెన్ భూములితీరుగన్. 79
సీ. అమ్మహీపతుండు రాజ్యమ్ము నేలెడువేళఁ
బదునెనిమిదినూర్ల పయిని మూఁడు
పదులపై రెండవ వత్సరమ్మునను గం
జము మండలమున విశాఖనగర
మండలమ్మునఁ జాల మెండుకొన్న పితూరి
దారులచేఁ గల్గు నారటంబు
వారించుటకునయి ప్రత్యేకముగఁ గమి
షనరుగ నేర్పాటు గనినయట్టి
తే. రసలు దొరవారు ఘోర గౌరవము మీరఁ
దగిన సేనను బంపి యుద్దానిచేఁ బి
తూరిదారులఁ బట్టించి దొంతనంబు

వారి మెప్పును గాంచె నా ప్రభువరుండు.

సీ. శ్రీమంతుఁ డై యొప్పు శ్వేతాచలపతి రం
గారాయ నృపతి శేఖరుఁడు మాడు
గులు జమీందారునివలన దండిసురవ
రము జగన్నాథపురమ్ము వీని
ప్రాంతమ్ము లైన యుప్పలరాజపురమును
వంతర్లపాలెము పప్పుసెట్టి
సేరియుఁ గొనియెను జీడికాడయు జగ
న్నాథపురమ్ము ననంగ నొప్పు

తే. చుండు నెస్సేటు గొనియెను మండపాక
కులజుఁ డైన జగన్నాయకునివలనను
ననుగుణం బైనయట్టి క్రయమ్ము లిచ్చి
రాజ్య మభివృద్ధి నొనఁగంగఁ బూజ్యగతిని.

గీ. కలబరిగి వంశజుఁ డగు భాస్కర నృసింహా
రావు పంతులవలన నా రాజవరుఁడు
గొనియెఁ గింతలి మంతెన యనెడు పేర్ల
బరగు మాలుండాల సోదరీ పతికి నొసఁగ.

సీ. వేలంబులోపల విజయరాఘవ పద్మ
నాభ రాజను జంపెనకులజుని మొ
ఖాసయై విజయనగర రాజ్యమందున
వెలయు నన్నయరాజుపేట కొత్త
వలస నాఁ దగుగ్రామముల దంతులూరివా
రి మొఖాసయైన గ్రామములను దుమ్మ
పాలను బెద్దింటివారివలన జమ్ము
గుజ్జంగివలస నాపజ్జ నంబ

తే. టివలసయు మరి దువ్వాము నవలఁ జింత
పల్లిపేట సేరీపేటఁ బదియును నెనీ

మిదిశతంబులపై నలువదిఁటమూఁడ
వదియయిన యేటఁ గొనియె నయ్యవనివిభుఁడు. 83

మ. తనకుఁ భావుకుఁడై దివానయిన సీతారామయఖ్యాతుతో
ల్తనయుండై తగు రామరాయమణికిఁ దాఁగింతలిఁ మంతెనఁ
జనకుం డిచ్చిన యుంగరాడను మనస్సంశుద్ధితో నిచ్చి చే
సెను బ్రోపై ౧టరుగాఁగ నవ్విభుఁడు హర్షింపఁ గడుఁ బాంధవున్.

గీ. మరియు నొక భావుకుండయి పరగుచున్న
రాజగోపాలరాయని కాజనపతి
చీడికాడ యెస్టేటును జిత్తమలరఁ
నొసఁగి ప్రొపై౧టరుగఁ జేసెఁ బొసఁగ నతని. 85

శా. దాతృత్వంబు దయారసంబు భగవత్కైంకర్యనిష్ఠాప్తియుఁ
భూతవ్రాత హితప్రవృత్తియు సహోద్భూతంబులై యొప్పు నా
శ్వేతాద్రీశ్వర రంగరాడ్విభుఁడు చేసెఁ భూమిదేవాళికిఁ
ఖ్యాతప్రక్రియ నగ్రహారము లనేకంబుల్ మనఃప్రీతితోన్. 86

క. తను నమ్మి కొలుచు సేవక
జనులకు నవ్వారిగాఁగ స్వర్ణముగృహముల్
ధనములు భూములు గ్రామము
లనేకము లొసంగె నల జనాధిపుఁడు తగన్. 87

సీ. హరిభక్తియందుఁ బ్రహ్లాదునిఁ దలపించు
నమహీశుఁడు ప్రత్యహమ్ముఁ దెల్ల
వారుజామున నె గోపాలదేవుని యాల
యమునకు నేగి భక్త్యతిశయమున
భగవంతు సేవించి భవనమ్మునకు వచ్చి
స్నానాదికృత్యముల్ సలిపి పిదప
భోజనమ్మునకును బూర్వము దేవుని
దర్శించి మరల నంధ్యానమయము
నందును దేవుని నందర్శనముఁ జేయు

నిది నిత్యకృత్యమై యొసగు నతని
తే. కిట్టు లిహపరముల నించుకేని లోప
మొనయకుండఁగఁ బొల్చె నా జనవరుండు
తోఁడిరాజులు పొగడఁగఁ బాడిగలిగి
తెగదె యాతని వర్ణింప జగతి మనకు. 88
క. ఆపదల మునుగకుండఁగఁ
గాపాడె ఋణంబు లిచ్చి కరుణాపరుఁడై
భూపాలుర నెందరినో
యా పుణ్యుం డధికసుకృత మందుట యరుదే. 89
చ. పురమున నల్గడన్ నికట భూములఁ దీయని నీరు గల్గుపు
ష్కరిణుల రాష్ట్రమం దతివిశాలములై జలపూరితంబు లౌ
చెరువులఁ బెక్కుతోటలను జెల్వుగ నిల్పి మహీవరుండు సో
దర జనకాదినామములు దైవముపేరులు నుంచె వానికిన్. 90
ఉత్సాహ. చాలధనము వ్యయముచేసి సత్యశీలుఁ డమ్మహీ
పాలవర్యుఁ డిప్పురంబు పజ్జనిల్పె వేణుగో
పాల వల్లభం బనంగఁ బరగుచుండు నట్టి మేల్
పూలతోట నొక్కదాని బుష్కరిణికిం జెంగటన్. 91
సీ. తనయులు లేమి నమ్మనుజేంద్రుఁడు పిఠాపు
రమ్ము పాలించి యశమ్ముగన్న
సూర్యరాయమహీశు సుతులు నల్వురిలోన
మూఁడవసుతు దత్తపుత్రుఁగఁగొని
తత్సూనునకును సీతారామకృష్ణ రా
యడప రంగారావటంచు నిష్ట
దైవనామమ్మును దండ్రిపేరును వంశ
బిరుదమ్ముగూరిచి పేరుపెట్టి
తే. తరి మిగులకుండ నెల్లవిద్యలను బండి
తులవలన నేర్వఁగాఁజేసి తురగ హస్తి

రథసమారోహ కుశలతఁ బ్రబలఁజేసి
కళలఁ బెక్కెంట వలతిగ నలరఁజేసి.

గీ. తనసహోదరి పుత్రియై తనరు లక్ష్మి
చెల్లమాంబిక యనెడు సుశీలవతిని
సూనునకుఁ గూర్చి వైభవస్ఫూర్తి వెలయఁ
బరిణయ మొనర్చె నెలమి నప్పార్థివుండు.

సీ. సమధిక భక్తి సుజ్ఞాన వైరాగ్య సం
స్తవనీయుఁడైన శ్వేతాచలపతి
రంగరాయ మహీశ పుంగవుఁ డిటు కృత
కృత్యుఁడై ముప్పదిరెండువత్స
రములు పూజ్యమ్ముగ రాజ్యమ్ము పాలించి
సర్వసుఖమ్ముల జనులఁ దనిపి
యవసాన దశయందు హరిపదాంబుజములు
మదినిల్పి పదునెనిమిది శతముల

తే. పయిని నరువదిరెండవ వత్సరమున న
గష్టు పదునెన్మిదవ తేదిఁ గాలధర్మ
మొంది వైకుంఠవాసియై యుభయలోక
సాధకుండయ్యె జన్మము సార్థకముగ.

క. ప్రకటయశుఁడు సీతారా
మ కృష్ణరాయుడవ రంగ మనుజేంద్రుఁడు తం
డ్రికిఁ బిదప రాజ్యమేలెను
సకల సుఖావాసముగఁ బ్రజల్ జయవెట్టన్.

క. పదునెనిమిదివందల నలు
వదియైదవవత్సరము నవమమాసమునన్
బదునేనవనాఁ డీయన
యుదయంబయి రాజ్యమేలె నొగి నైదేడుల్.

సీ. శ్వేతాచలపతి ధాత్రీతలనాథుండు

దొరతనపుం బద్ధతుఁను బట్టి
పుత్రుని బాల్యంబు పోవుటకొక కొన్ని
నెలలు తక్కువగాఁగ నిత్యపదవి
గొనుటచే సంస్థానమును నిజపాలన
మునకుఁ గైకొంట శాసనమువలన
విహితమై యుండియు బ్రిటిషుసామ్రాజ్యాధి
పతులు తత్కాల మల్పముఁ యుంట
తే. రాజ్యమునకును నిందున్న ప్రజలకును నొ
కింతయొత్తుడు లేకుండ నిచటి మంత్రి
పాలనమునందె యుండు నేర్పాటు నను
తించి విడిచిరి సంస్థాన మంచితముగ. 97
ఉ. అమ్మనుజేంద్రసూతి తరి మాటయుఁ బూజ్యతమమ్ముగాఁగ రా
జ్యమ్మును స్వీకరించి తనయప్రతిమంబగు బుద్ధిచేతఁ గో
శమ్మును వృద్ధిచేసి నిజశాసనమున్ బ్రజలెల్ల మౌళిచే
నిమ్ములఁ దాల్పఁ బౌరుషము నెంతయుఁ జూపుచు నేలె ధారుణిన్. 98
సీ. జనకుఁ డేర్పరచిన సద్ధర్మములనెల్ల
జరపుచు వానికి సమ్మదమున
నభివృద్ధి తనరున ట్లాచరించుచును దే
వోత్సవమ్ముల వైభవోజ్జ్వలముగఁ
జేయించుచును నిజాశ్రితవర్గమునకును
భృత్యసంతతికిని వేతనమ్ము
లర్హవైఖరి వృద్ధి నలరించుచును శౌర్య
మౌదార్యమును న్యాయ మార్దవంబు
తే. జనులు వినుతింప నేలె నా జనవిభుండు
సరస సంగీత సాహిత్య నిరత గోష్ఠి
వ్యావహారిక నైపుణిఁ బండితులును
మంత్రివరులును మెచ్చ సమగ్రమహిమ. 99

ఉ. వేదములున్ దదంగములు విశ్రుతవైఖరి శిష్యకోటి స
మ్మోదమునొంద నేర్పు బుధ ముఖ్యులు పట్టణమం దెసంగుటన్
వైదిక విద్య లెంతయును బాగు వహింపఁగ నాంగ్లవిద్యనున్
బాదుకొనంగఁ జేయుటయుఁ బౌరుల లాభమటంచు నెంచుచున్.

గీ. పదియు నెనిమిదినూరులపయిని నారు
పదులమీఁదను నాల్గవవత్సరమున
దేశభాషయు నింగ్లీషుఁ దెలుపుఁ బాఠ
శాల నిప్పురి నిల్పె నా జనవిభుండు. 101

గీ. పదియు నెనిమిదినూరులపయిని నరువ
దెనిమిదవ వర్షమున నైదవనెలను బది
యేడవదినంబునందుఁ దా నేగె దివికిఁ
గీర్తిధనుఁడు సీతారామకృష్ణవిభుఁడు. 102

క. సుత రహితుఁ డగుచు నా భూ
పతియిటు దివికేఁగ దుఃఖపరవశ యయ్యున్
ధృతి మెయిఁ గైకొని నాతని
సతి లక్ష్మిచెల్లమాంబ సంస్థానమ్మున్. 103

సీ. తన మామ పాలనమునుండి సామర్థ్య
మున మంత్రిపదమంది తనరు వాని
విద్యాబలము బుద్ధివిభవంబు వ్యవహార
నిపుణతయును గల్గి నెగడువాని
జాల ప్రసిద్ధుఁడై చన్న యిస్గంటి సీ
తారాము మంత్రి పౌత్రత వహించి
యాతనిపేరున నమరువానిని మంత్రి
పదమందు నిలిపి యా సదమలాత్ము

తే. సాహాయ్యమున రాజ్యమేలెను జతురముగను
సబల యయ్యును బౌరుష ప్రబలయగుచుఁ
బ్రజల సతంసపరచుచు రాణి లక్ష్మి

చెల్లమాంబిక శ్రితకల్పవల్లి యగుచు. 104

సీ. తనపతి వైకుంఠమున కేగునప్పుడు
తనకొసంగిన యనుజ్ఞను మది నిడి
వేంకటగిరి వంశవృక్షమ్మునం దిర్వ
దేడవపురుషుఁడై యెసగుచున్న
మహిత సర్వజ్ఞకుమార యాచ నరేంద్రు
మూడవసుతు వంశమునకుఁ గర్తఁ
గాఁగోరఁదలఁచి వేంకటగిరి నగరికి
సచివ పండిత బాంధుజన యుతముగఁ

తే. బైనమయి యేగి యమ్మహీపాలు నుచిత
గతిని యీ రాణి ప్రార్థింపఁగా నతండు
తనయు నిచ్చెద ననుచు వాగ్దాన మెలమిఁ
జేయ నా యమ్మ హర్షితచిత్త యగుచు. 105

గీ. పదియు నెనిమిదినూరుల పయిని డెబ్బ
దియొకటవ వత్సరమున విధి విహితముగ
హోమ పూర్వకముగఁ దనయుని బరిగ్ర
హించి కొన్నాళ్లు తత్పురి నెలమి నుండి. 106

ఉ. అమ్మనుజేంద్రుఁడంపఁ దన యా ప్తులఁదోడ్కొని కార్యసిద్ధిచే
ముమ్మరమైనహర్షమున మున్గుచు భృత్త్యులు వెంటరాఁగఁ బై
నమ్మయి బొబ్బిలీపురిజనమ్ముల కన్నుల కర్వెసిర నా
యమ్మ పురమ్ముఁ జేరెను కృతార్థతనొందిమహోత్సవమ్మునన్. 107

క. పదు నెనిమిదివందల డె
బ్బది రెండవవర్షము కడపటినెలను బ్రజల్
ముదమంద బొబ్బిలికి నీ
సదమలగుణుఁడైన రాజచంద్రుఁడు వచ్చెన్. 108

క॥ కొమరుని బాల్యమునం దీ
యమ సంస్థానమ్ము నెల్ల నాప్తసచివ సా

వ్యాయమున నొక యింతయును లో
పము దొరయకయుండునట్లు పరిపాలించెన్. 109

క. మును వసియించిన దుర్గం
బు నసంపత్కరమటంచు బుద్ధిఁ దలఁచి య
వ్వని తారతమ్యం బీ క్రొ
త్త నగరు గట్టించుటకు మొదలు కావించెఁ. 110

క. పదునెనిమిదివందల డె
బ్బదిమూడవ వర్షమునను బంగాళమునఁ
దుదలేని కఱవుపర్వఁగ
సదయాత్మత లోకులెల్ల సంభావింపన్. 111

సీ. ఇమ్మహారాజ్ఞి తా నేబదివేల రూ
ప్యమ్ములు సేయు ధాన్యమ్ము మిగుల
ధారాళమైన యౌదార్యంబుతోఁ దన్ని
వారణంబునకయి పంపెఁ దాన
నెంతయు ముదమంది యిండ్యా గవర్నమెం
టును జెన్నపురి దొరతనమువారు
నీ సుమ యౌదార్య మెంతయుఁ బొగడిరి
పత్రికాముఖమునఁ బ్రకటితముగ

తే. నింతయేటికి ధర్మము లెన్నియేని
ఘనత రౌదార్యమునఁ జేసి గణనకెక్క
రాణులకు మేటి బొబ్బిలిరాణి యనఁగ
భవ్యగుణపేటి చెల్లమాంబావధూటి. 112

సీ. పదునెనిమిదినూర్లపయి డెబ్బదైదవ
యబ్దంబునందు బ్రిన్సాఫువేల్సు
చెన్నపురమ్ము నీక్షింప వచ్చెడునప్డు
తద్దర్శనార్థమై ధారుణీశు
లరుగుచో నిజమంత్రియైన యిన్గంటి సీ

తారామవిభుని నాత్మప్రతినిధిఁ
గాఁ బంపుచును నొక ఘనమగు దంతపుఁ
బల్లకి నజరుగాఁబట్టఁ బనిచె
తే. నమ్మహాప్రభువర్యుఁ డత్యంతగౌర
వమ్ము దయయు నెసంగ నాయమ్మ కొక్క
పతకము నొసంగి యమ్మాత్రివరుని రాజ
గౌరవమ్మునఁ గాంచెఁ దత్కాలమందు. 113
గీ. పదునెనిమిదినూర్లపయి డెబ్బదారవ
యేట నీమె ధర్మకృత్యములకు
మెచ్చి రాణియనెడు మేల్బిరుదము దొర
తనమువార లిడిరి ఘనతమీఱ. 114
ఉ. ఏనదినీటిబిందు వొక యించుక దేహమునందు సోకినన్
మానును సమస్తదుష్కృతగణంబని శాస్త్రమువల్కు నట్టి గం
గానది పుణ్యతోయమె యఖండముగా సమకూర్చి నిత్యమున్
బానము సేయు నీయమ సుపావన గాదె తలంచి చూడఁగన్. 115
సీ. పదునెనిమిదినూర్లపయి డెబ్బదారవ
సంవత్సరమున బస్తరుసమీప
మునను బుట్టిన పితూరి నడంచుటకుఁ బ్రభు
త్వమువారు సేనలఁ బంపునపుడు
దుర్గమ కాననమార్గమ్మునందు సై
న్యము లేగుటకు వలసైన సాయ
ముల భక్తితోఁడ నీ లలనాశిరోమణి
చేయింపఁగా సంతసించి దొరత
తే. నమ్మువారు స్వకీయాభినందనముల
నంపిరి విశాఖపుర మండలాధినాథుఁ
డైన గుడ్డిచిదొర చేత నర్హభంగిఁ
బత్రికాముఖమునఁ గడుఁ బ్రస్తుతించి. 116

గీ. పదియు నెనిమిదిశతములపయి నశీతి
మీఁద నేడవయేటను మే యనునెల
నిర్వదెనిమిదౌదినమున నేగె దివికి
శీలవతియైన శ్రీలక్ష్మి చెల్లమాంబ. 117

---

గీ. లలిత వేంకట శ్వేతాచలపతి రంగ
వసుమతీనాథ వర్యుఁ డీవంశమందుఁ
బదునొకండవ పురుషుఁడై ప్రజల నిపుడు
ప్రోచుచున్నాఁడు సంతతాభ్యుదయమొంది. 118
క. పదునెనిమిదివందల యరు
వదిరెండవ సమ నగష్టు వరమాసము ని
ర్వదియెనిమిదవ దినంబున
నుదయించె నరేంద్రుఁ డీతఁ డుత్తమవేళన్. 119
సీ. శ్రీబొబ్బిలీరాజ్య సింహాసనేశ్వరి
యైన లక్ష్మీచెల్ల మాంబికకును
దత్తపుత్రుండయి తద్రాజధానికిఁ
బూర్వోక్తవత్సరమునను వచ్చి
హిందువులయినట్టి యిరువురు గురువులు
చదివింపఁ గొన్నివర్షములు చదివి
యాజన్మశుద్ధుఁడు నమలవర్తనుఁడని
జగమున నెంతయు బొగడుగన్న
తే. హూణపండితుఁడగు మార్షునొద్ద మూఁడు
వత్సరమ్ములు నొక యర్ధవత్సరంపుఁ
గాలమును బూన్కితో విద్య గఱచె నిమ్మ
హీశుఁ డసదృశ మేధామహిమ చెలంగ. 120
సీ. న్యాయవేదాంతాదు లైన విద్యల నెవ్వఁ
డసదృశ పాండిత్య మధిగమించె

సత్య దయా శౌచ శమ దమ ముఖ సద్గు
ణమ్ము లెవ్వనికి సాజమ్ములయ్యె
విద్యయు నన్నంబు వెనుదీయ కొసఁగుచుఁ
దనిపెను శిష్యబృందముల నెవఁడు
బొబ్బిలి సంస్థానమున కలంకారమై
యెవ్వఁడు గడియించె నిద్ధకీర్తి
తే. నట్టి శ్రీమత్సుసుర్లాన్వయాబ్ధి శీత
కిరణుఁడైన సీతారామ గురువరేణ్యుఁ
డిమ్మహీరమణునకు సంస్కృతపు విద్యఁ
గఱపె నెంతయు నాదర కలితుఁడగుచు. 121
గీ. ఈ యుపాధ్యాయు లిరువురు నివ్విభునకు
విద్యనేర్పుటయేకాక వివిధ రాజ
నీతులును ధర్మములును ననేకము లగు
ముఖ్యవిషయముల్ దెలిపిరి ముదముతోడ. 122
సీ. ఇరువదియైదువత్సరములు చెల్లగ
రాజ్యపాలనము నీ రాజవరుఁడు
చేయఁగ హర్షితచిత్తులై ప్రజలు స
హస్రాధికధనంబు వ్యయముచేసి
శిల్ప చాతుర్య విశేషముచే నున్న
రూపుఁ దెల్పెడి ప్రభురూపపటము
బుర సభామందిరమున భక్తితోనిల్పె
గురుభక్తుఁడైన యిన్నరవరుండు
తే. నాంగ్ల గీర్వాణ గురువుల యాకృతిగల
పటములను దాని కుభయ పార్శ్వముల నిలిపెఁ
బ్రజల ప్రభుభక్తియును రాజవర్యుని గురు
భక్తియును గనబడును దబ్బవనమ్ముఁదు. 123
సీ. ఇండియాదేశ మఖండముగా నేలు

విక్టోరియా యనువెలదిమిన్న
భరతఖండపుఁ జక్రవర్తిని యనుబిరు
దమ్మును ధరియించు తరిని మున్ను
పదునెనిమీఁదినూర్ల పయి డెబ్బదేడవ
సంవత్సరమున విశాఖపురిని
దర్బారు జరిగిన దాని కీనరపతి
విచ్చేసె నచటికి వచ్చిన ప్రభు
తే. వరులలోపల నీ భూమివరుఁడు విజయ
నగర విభుసుతుఁడైన యానందగజప
తి ప్రభుఁడు మాత్రమే యాసభాప్రదేశ
మున డయినుపై వసించిరి ఘనతమీఱ. 124
క. మును బొబ్బిలియుద్ధమునకు
మునుపటినుండియును వైరములు గల యిమ్మే
దినినాథ కుటుంబస్థులు
తనరిరి కలయికను నచట దత్ప్రథమముగన్. 125
క. మరుచటి వత్సరమున ని
న్నరనాథుఁడు వేంకటగిరి నగరమునకుఁ దాఁ
నరిగె నచట జ్యేష్ఠసహో
దరు నభిషేకోత్సవము ముదమ్మునఁ జూడన్. 126
గీ. పీఠికాపురమునకు బొబ్బిలికిని జట
ప్రోలునకు దత్తులయినట్టి మువ్వురుసోద
రులును దత్ప్రథమంబుగఁ గలిసి రచటఁ
ద దభిషేకోత్సవంపు సందర్భమునను. 127
సీ. పదునెనిమిదినూర్ల పయి డెబ్బదెన్మిదా
వత్సరమ్మునను వివాహితయగు
నివ్విభు తొలుపత్ని యేగె స్వర్గమునకుఁ
బుత్రు నొక్కని గని పురిటిలోన

పదునెనిమిదినూర్ల వయి నెనుబదియవ
యబ్దంబునను మార్చి యందిరువది
యొనిమిదాతిథి నుదయించిన యీ సుతా
గ్రణి యొప్పుచుండు వేంకటకుమార
తే. కృష్ణరంగేంద్ర నామసంకీర్తితుఁడయి
జనకు పోషణమున శుక్లశశివిధమునఁ
గళల కిరవయి సుగుణ సంకలితుఁ డగుచు
వెలయుచున్నాఁడు మరియును వెలయఁగలఁడు. 128
సీ. పద్ధతులనుబట్టి బాల్యంబుదీరుట
కొకయింత తరవాయి యుండునపుడె
పాలక జనని కిప్పార్థివేంద్రునకును
గలిగెఁ బరస్పర కలహ మది ని
వారణచేయు నప్పటి కలెక్టరయిన
గారిస్ట నొనరించెఁ గడుఁ బ్రయత్న
మది పూర్తికాకముం దతఁ డేగె బోర్డుమెం
బరుపనికయి చెన్నపట్టణంబు
తే. నంత రంపపితూరిని నడఁప నదియు
పనిగ వచ్చిన కార్మైకల్ ఘనుఁడు వాల
తేరున వసించి యీ చిక్కు తెలిసి సంధి
చేసె నుభయులకును బ్రజల్ సేమమంద. 129
సీ. ఇమ్మహీశుఁడు ప్రభుత్వమ్ము గైకొను సమ
యమ్మునఁ గోశమ్మునందు నూట
నలువదియొకరూప్యములకుఁ గానులు నాల్గు
కొఱతయై యుండె లోకులకు నీయ
వలసిన బాపతుల్ నలువదియారు స
హస్రంబులై యుండె నదియుఁగాక
పాలక జనని యావజ్జీవితము నేల

నరువదివేల రూప్యములు వచ్చు
తే. కరకవలస యెస్టేటును గ్రామము లొక
కొన్నియు నొసంగి యయ్యమ కోర్కి దీర్చి
రాజ్యతంత్రంబు లదిమొదల్ పూజ్యగతిని
నడపుచున్నాఁడు ప్రజలు సంతసము నొంద 130
సీ. జ్యేష్ఠసోదరుఁ డయి చెలఁగు వేంకటగిరి
ప్రభుఁ డగు రాజగోపాలకృష్ణ
యాచేంద్రనృపతి సౌహార్దంబుతో మున్ను
వచ్చియుండఁగ శుభ వాసరమునఁ
దొలిపత్ని చెలియలి నెలమి వివాహమై
పదునెనిమిదినూర్ల పయి నెనుబది
యొకటవయబ్దమం దొప్పు నవంబరు
నెల నిర్వదవతేది కిల సమమగు
వృషవత్సరమ్మున హేమంతమున మార్గ
శీర్షాదిపక్ష విశిష్ట దశమి
హిత పురోహిత బుధప్రతతియు సచివసా
మంతులు నిజ బంధు మండలియును
నర్హస్థలంబుల నాసీనులయి చూడ
నభిషేకకృత్యంబు ననుభవించి
భూసురాశీర్వాదముల నొంది కృతకృత్యుఁ
డైన శ్రీరంగరాయావనీంద్రు
నొదలపయిని బుణ్యాంబువులను జిల్కి
శ్రీరాజగోపాలకృష్ణ సూచ
భూతలేశుఁడు రాజ నీతుల మృదుమధు
రోక్తుల నుపదేశ మొసగి ఖడ్గ
ముద్రిక లిచ్చె నప్పుడు గలెక్టరయిన
ఘనుఁడు టర్నరుదొర మనుజనాథు

మనలందు పయి ముద మెసఁగ నాసీనునిఁ
గాఁ జేసె, నభిషేక కార్య మిట్లు
తే. సాగుటయు నుత్సవాగత జనుల కర్హ
సత్కృతులు చేసి, యుచిత సంస్కారములను
జేసి, రాజ్యము నభివృద్ధి చెందునట్లు
చేయుచున్నాఁడు, శ్రీరంగరాయ విభుఁడు. 131
సీ. బొబ్బిలిపురమున మును మిడిల్‌స్కూలుగా
నున్నట్టి దాని నీయుర్వివిభుఁడు
పదునెనిమిదినూర్ల పయి నెనుబదిరెండ
వదియైన క్రైస్తవహాయనమున
హైస్కూలు గాఁ జేసి, యద్దానికిని దొర
తనమువా రొసఁగెడు ధనము గొనుట
మాని, యప్పటినుండి దాని సర్వవ్యయం
బుల భరించుచును యోగ్యులు సమర్థు
తే. లగు నుపాధ్యాయులనుగూర్చి యర్హరీతి
నరయుచుండుటఁ గ్రమవృద్ధి నంది, తోడి
పాఠశాలలలోన మేల్‌బంతియనఁగ
మెప్పుగని యది యొప్పెడు నిప్పటికిని. 132
ఉ. కన్నులుఁ గాలునుం గలిగి కష్టపడం గలవార లెందు నే
నన్నముఁ దెచ్చికోంద్రు, వికలాంగులు దీనులు నైనవారికిన్
బన్నుగ నన్నవస్త్రములు వాసమునున్ గలిగించి ప్రోచుటల్
పున్నెములందు మేలయిన పున్నెముగా నరనాథుఁడెంచుచున్. 133
ఉ. అంగవిహీనులై యనదలైన జనంబుల రక్షణంబు నే
యంగను సత్రమొక్కటి పురాంతికదేశమునందు నిల్పి, దా
నిం గనుగల్గి ప్రోచుటకు నేర్పరులన్ నియమించి ప్రాజ్ఞు లె
న్నంగఁ దదీయ రక్షణమునం గడు నక్కరగల్గి యొప్పెడున్. 134
శా. డెందం బార్యమతాంశసంకలితగోష్ఠీసక్త మాటన్ మన

స్సందేహంబులు వాయఁ దద్విషయముల్ చర్చించు కోర్కిన్ బుధా
నందిన్యాఖ్యఁ దనర్చు పండితసభన్ స్థాపించి,యందున్ సుధీ
బృందాస్యోద్గతవాఙ్మయంబులకు నెంతే సంతసంబందుచున్. 135

ఉ. ధీసముదగ్రతన్ వివిధదేశ సమాగత పండితాళియున్,
మోసల నున్నయట్టి బుధముఖ్యులు నౌనని మెచ్చ, యుక్తి వి
న్యాసముతోడ సంఘవిషయార్యమతాంశ సమస్త నీత్యుప
న్యాసము లెన్నియేని నరనాథుఁడుచేయు సభాంతరంబునన్. 136

ఉ. విన్నది యెల్ల నమ్మక వివేకముతోడ విమర్శచేసెడు
న్గన్నదియెల్ల డెందమున నాటెడునట్లు పరీక్షసేయుఁ దా
నన్నది యెల్ల సత్యమని యందఱు మెచ్చఁగ మాటలాడు, వి
ద్వన్నిచయస్తుతుం డితఁడు పార్థివమాత్రుఁడె? యెంచి చూడఁగన్.

క. అద్వైత ద్వైత విశి
ష్టాద్వైతము లనెడు మతము లందలి నిజముల్
విద్వాంసులు మెచ్చఁగ నీ
విద్వత్ప్రభుఁ డెఱిఁగె, బుద్ధి విభవముచేతన్. 138

ఉ. ఏలిన రాజవర్యుఁ డని యిచ్చకమాడుటగాదు, ధారుణీ
పాలనకేళియందును త్రివర్గ నిషేవణ సామ్యయుక్తిచేఁ
గాలము వ్యర్థపుచ్చని ప్రగల్భతయందును, నిప్పు డున్న భూ
పాలురలోన మేటియని పల్కుట కడ్డము లేదొకింతయున్. 139

ఉ. కాల వినిర్ణయం బఖిలకార్యములన్ సఫలమ్ముచేయఁగా
జాలునటన్న కీలెఱిఁగి, శైశవమాదిగ సర్వకృత్యముల్
కాల విభాగపూర్వకముగా నొనరించుచు నుండి యిమ్మహీ
పాలవరుండు నిర్భరుని వైఖరి నెప్పుడు చూడఁగా దగున్. 140

చ. జనపతు లెట్లు నిర్ణయము సల్పిన నట్టులె సాగుఁ గాని వా
రి నియమ మాశ్రితావళియు భృత్యులు లోకులు మెచ్చునట్లుగా
దనరుట వారి దౌ చతురతన్ ప్రకటించుచునుండు నెప్డు, మా
జనపతి కాలనిర్ణయ మెసంగును సర్వ జనానుకూలతన్. 141

మ. వ్యవహారంబుల నారితేరిన మహాప్రాజ్ఞుల్ తగం గూడి వా
దవిశేషంబులు యుక్తివైభవముచేతన్ జేసినన్ దీర్పఁగా
నవకాశంబు నొసంగనట్టి ఘనకార్యంబుల్ వినంగానె యీ
యవనీనాథుఁడు తీర్చు నప్రతిహతంబైనట్టి బుద్ధిప్రథన్. 142

ఉ. క్రొత్తగ రాజ్యపీఠమును గొన్న నరేంద్రకుమారులెల్ల నీ
యుత్తముఁ డేర్పరించిన నయోన్నతపాలన సూత్రజాలముల్
చిత్తములందు హత్తుకొనఁ జేసినఁ జాలును, సద్వివేక సం
పత్తిని నైజ రాజ్య పరిపాలన దక్షతఁ గాంతు రెంతయున్. 143

క. మారాజనర్య యుక్తా
హార విహారమ్ములు వ్యవహార మృదువ్యా
హారమ్ములు దుర్గుణపరి
హారమ్మును జెలఁగు సంస్తవార్హము లగుచున్. 144

నిత్యవర్తనాదికము - సీసమాలిక.

ఇనుఁ డుదయింపకమును నిద్ర మేల్కని
సమయ కృత్యములను జక్కఁ జేసి
యంతఃపురము పొంత కరిగి బిడ్డల సేమ
మరసి రథారూఢుఁ డగుచుఁ గదలి
నగరంబు వెలుపలఁ దగుతోటలును రమ్య
హర్మ్యంబు లింపు జలాశయములు
తిలకించుచును జని దేహపరిశ్రమ
కనువగు వ్యాయామ మాచరించి
లోనికి నరుదెంచి దైనికవృత్తాంత
పత్రికలును నిజబంధుమిత్రు
లాదిగాఁ గలవార లయ్యయిచోటుల
నుండి పంపిన యట్టి యుత్తరములు
మొదలగు కాగితములు గాంచి స్నానగృ
హమ్మునఁ గోష్ణజలమ్ము చేత

నభిషిక్తుఁడగుచు ధౌతాంబరంబులు దాల్చి
పుండ్రంబుఁ దీరిచి పూర్ణనియతి
హరిమంత్రజపము శ్రీహరిపాదతీర్థ ప్ర
సాదసేవనమును సలిపి పిదప
హిత మిత కాల యోజిత భోజనము జేసి
యిష్టగోష్ఠిని నొకయింత సేపు
నడపి యంతిపురంబునకు నేగి వచ్చి పం
డ్రెండుగంటలకును నిద్రనొంది
రెండుగంటలకు సరిగ మేలుకాంచి కా
ర్యాసనగతుఁడయి, యది మొదలుగ
సంస్థానకార్యముల్ సచివులు నుద్యోగు
లును నను క్రమమున మనవిచేయ
నాలకించుచును గార్యానుగుణంబుగఁ
దత్క్షణమ్మున నె యుత్తరువులొసఁగి
యాయవ్యయాదిక వ్యవహారములఁ దెల్పు
ముఖ్యమౌ కాగితములపయి నిజ
హస్తాక్షరాంకము లతిపరీక్షాపూర్వ
కముగఁ జేయుచు నాల్గుగంటలవర
కందఱుఁబంపి యానందముతో బుధ
గోష్ఠీవినోదంబుఁ గొంత చేసి
యుద్ధితుండయి సమయోచితవస్త్రముల్
ధరియించి యాత్మసౌధమ్ముడిగ్గి
రథముపై నెక్కి పురమ్మును వెలువడి
సౌరభమ్మును వెదచల్లుఁ బుష్ప
వనములను బరిశుద్ధవాయువు సేవించు
చును విహారము కొంతదనుక సలిపి
నగరులోనికి దినాంతమ్మునఁ జనుదెంచి

బిలియర్డు మొదలుగా గలవినోద
ములలోన నేదేనిసలిపి నిర్ణీతకా
లమ్మునఁ దగ భోజనమ్ము చేసి
గోష్ఠీవినోదంబు కొంతసేపు ఘటించి
పదిగంటలకు మీఁదఁ బవ్వళించు,
నిది నిత్యకృత్యమై యెసఁగు నివ్విభునకు
సర్వకాలము నిట్లు జరుగుచుండు
నేవేళ యేపని కేర్పడి యుండెనో
యావేళ నప్పని యప్రతిహతి
నడిపించునేకాని తడవుసేయఁ డొకింత
నరపతు లిట్టుంట యరిదిగాదె?
యయ్యయి పనులపై నందఱ నియమించి
యును దాసహస్రాక్షుఁడనఁగ నెపుడు
నన్నియు సుపరీక్ష నరయుచు నుండును
జారముఖంబున స్వయముగాను
బలుకులఁ జెయువులఁ బరుల మనోభావ
మిట్టిదటంచుఁ దా నట్టె తెలియుఁ
గోపకారణ మెంత కూడియుండిననైనఁ
బరుసని పలు కింతపయికిఁ జేడు
కలఁక యొకింతయుఁ దలఁపున లేక తక్
గొలిచెడు నాశ్రితకోటి కెపుడు
కోరక మునుమున్నె కోరఁగాలఁ గనుగొని
కోరికల్ దీర్చు నవారితముగ
దైవికమ్ముగ నాపదలు గల్గునప్పుడు
సహజధైర్యగుణంబు సడలనీఁడు
సంతోషకారణ మెంతకల్గిన హర్ష
పరవశుండగుట గన్పట్ట దెపుడు

పరదేశమునుండి పండితుల్ వచ్చిన
దర్శనమొసఁగి విద్యావినోద
మును జేసి యోగ్యత కనురూపమైన స
త్కారమ్ముచేఁ దన్పి వారి ననువు
ధర్మము లనుషేరఁ దనరినవానిలో
మర్మమ్ము నెఱిఁగి యీ మనుజవిభుఁడు
సమయోచితమ్ములు జన సుఖప్రదములు
నైన ధర్మంబులె యాచరించు
నావశ్యకములైన యట్టి కార్యములందు
వ్యయ మెంతయైన లక్ష్యముగఁ గొనఁడు
అనవసరమ్ముగ నరకాసు నేనియుఁ
బోనీయకుండును బూన్కి తోఁడ
నిమ్మహీశుచరిత్ర మేనెఱింగిన పాటి
దిక్ప్రదర్శనముగఁ దెలిపినాఁడ,
తే. నవనిపాలురెకాదు, గృహస్థులైన
నిమ్మహీపతి వర్తన మిమ్ముగాను
గాంచి మదినుంచికొని ప్రవర్తించిరేని
యెల్లసుఖములఁ బొందుదు రిందు నందు. 145
సీ. శ్రీయుత వేంకటశ్వేతాచలపతి రం
గారాయ మేదినీకాంత మౌళి
రాజ్యభారము పూని పూజ్యవైఖరిఁ బాల
నమ్ము చేసెడి సమయమ్మునందు
గ్రాంటుడఫ్ నాముక ఘనుఁడు మద్రాసు గ
వర్నరుగానుండి పదునెనిమిది
నందల యెనుబదిపయిని మూడవయేట
నుత్తరరాజ్యములోలిఁ గనుచుఁ
బిబ్రవరి నెల బొబ్బిలికి విచ్చేసిన•

నెంతయు వేడుక నెదురుకోలు
నడపి యాఘనుఁ బ్రాఁతనగరునవిడియించి
పరమ సత్కారమ్ము జరిపె, హర్ష
భరితాత్ముఁడై యతఁ డరుగుచు బెజవాడ
నగరిని బ్రజల మన్నపుఁబత్ర
మునకుఁ బ్రత్యుత్తరము నొసంగఁ నప్పుడీ
సరకారులందుఁ బ్రజలకు మేలు
పలుతెరంగులఁ జేయువారలు తమచుట్టుఁ
గలరట్టివారు బొబ్బిలి విజయన
గరము మందస పిటాపురముల నేలు వా
రలటంచుఁ దాను బొబ్బిలిపురమున
తే. గాంచిన విశేషములకు హర్షించినట్లు
పలికె నిప్పురమునకు గవర్నరు లరు
దెంచుటయుఁ దత్ప్రథమమటాట నంచితమగు
మోదమును నబ్బురంబును బొందె జనము. 146
గీ. వేంకటగిరికిఁ దిరుగ నీవిభుఁడు సనగ
నచటఁ దద్రాజవరుని రెండవ వివాహ
మును, మరియు ముద్దుకృష్ణయాచ సరపాలు
పరిణయమ్మును నయ్యె వైభవము మిగుల. 147
గీ. బొబ్బిలికుటుంబమునకు నీ భూవిభుండు
దత్తుఁడగుటను విధి విహితమ్ములైన
శ్రాద్ధవిధులను ద్వరలోన జరపి వచ్చు
టెంతయును ముఖ్యమని మది నెఱిఁగియుండి. 148
క. పరిజనులతోఁడఁ గాశీ
పురము గయాపురి ప్రయాగమును గని, శ్రద్ధా
భరితుఁడయి శ్రాద్ధవిధులను
జరపి కృతార్థుఁడయి వచ్చె జనపతిమేరలన్. 149

క. జననాథుని రెండవసతి
తనయుని గని పురిటిలోనె తా వైకుంఠం
బునకుఁ జనె నీవత్సర
మున, విధి గడవంగవశమె భువినెవ్వరికిన్. 150

సీ. దక్షిణదేశానఁ దనరు దివ్యక్షేత్ర
ములు నదీ నదములు ముఖ్యపట్ట
ణమ్ములుఁ జూడ మనమ్మునఁ దలపోసి
పరివారయుక్తుఁడై పదునెనిమిది
వందల మొనుబది పయిని నారవవత్స
రమ్మున, మును సింగరాయకొండ
నెల్లూరు నగరియు నల్ల వేంకటగిరి
తిరుపతి శ్రీ కంచిపురి చిదంబ
రంబులు తంజాపురంబును గుంభఘో
ణక్షేత్రమును మరి నాగపురము
మధుర శ్రీరంగము మన్నారుగుడి తిరు
వాలూరు రామేశ్వరాలయమ్ము
తే. తూత్తుకుడియును గోయముత్తూరు మరియు
నీలగిరి కాలికట్టును సేలము పుదు
చేరి పట్టణమును బెంగుళూరు మొదలు
గలప్రదేశము లెల్లను గాంచివచ్చె. 151

గీ. చెన్నపురమున నున్నపు డిన్నరపతి
యపుడు రాజప్రతినిధియైనట్టి డఫర
న నెడిప్రభువర్యుఁ డప్పురమునకు రాఁగ
నతని దర్శనలాభము నందివచ్చె. 152

చ. జననరుఁ డాత్మవాస మగుసౌధము కట్టెదుటన్ మహోన్నతం
బు నతిదృఢత్వ సంకలితమున్ సువిశాలము సర్వకాల సౌ
ఖ్యనిలయమున్ సురమ్యమునునై తగు హర్మ్యముఁ గట్టి ప్రాగ్దిశన్

దనరుచు నుంటఁజేసి యలదానికిఁ బ్రాజ్ఞనుహాలంచుఁ జేరిడ్జా. 152

1887

ఉ. పాలక మాతయుఁ జననిఁ బాసిన ముద్దుల చిన్ని పుత్రుఁడుఁ
గాలవశంబునొందుటయు నైజ శరీరము పెక్కుమాసముల్
చాల కృశించి రుగ్ణత నలంగియు దుఃఖదమయ్యె నిమ్మహీ
పాలున కెన్నదారిటికిఁ బైనగు వత్సర మన్నిభంగులన్. 153

సీ. విక్టోరియారాజ్ఞి వెలయ నేబదివత్స
రమ్ములు దగఁ బ్రభుత్వమ్ము సేయ
బ్రజలును బ్రభువులు భక్తితో జూబిలి
యను వేడుకను దేశమందుఁ జేసి
రద్దాని గురుతుగ నావశ్యకమ్మగు
మార్కెట్టు గట్టించి మనుజ విభుఁడు
చక్రవర్తిని యనుజ్ఞను బొంద విక్టోరి
యా మార్కెటను నామ మలరఁ జేసి

తే. పదియు నెనిమిది నూరుల పయిని నెనుబ
దేడవ శకాబ్దమున జూను నిరువదియవ
తేది నద్దానికిని బునియాదు శిలను
స్వకరమున నిలిపెను మహాజనుల మ్రోల. 154

ఉ. అంతియుకాక భక్తి భరితాంతరవర్తన బోధకంబు న
త్యంత సుసంగతార్థమును నొ నభినందన పత్ర మిమ్మహీ
కాంతుఁడు శిల్పనైపుణిఁ బ్రకాశమునొందెడు వెండి పెట్టియఁ
సంతన చేసి పంపె నల సర్వమహీతల మేలు రాణికిన్. 155

చ. నగుమొగముఁ సుతీక్ష్ణమగు నాసికయుఁ బలితంపుఱెక్కలుఁ
జిగిబిగిగల్గు మేను గడుఁ జేఁగ దనర్చిన జానుజంఘలుఁ
నగము భుజంబులఁ మడచి చాపినయట్టి కరోదరంబులుఁ
దగఁ బరిశుద్ధకాష్ఠ రచితంబగు గారుడమైన వాహమున్. 156

గీ. పదియు నెనిమిదివందల పయి నెనిమిది

పదులమీఁదను నేడవ వత్సరమున
నవమమాసాష్టవింశదినమున నృపతి
వేణుగోపాలునకు సమర్పించె భక్తి. 157

1888

సీ. పదునెనిమిదినూర్ల పయి నెనుబదియెని
దగునేట మదరాసు నగరమునకు
ధరణీశుఁ జేరి స్టీమరు దిగఁగా గవ
ర్నరునిదా బండి నీ రాజవర్యు
నధివసింపఁగఁజేసి యంగరక్షకులలో
కొందు లేవురు వెంటరాఁగ బసకు
ననిపె నేడేశాము, జనపతికిట్టి గౌ
రవముగల్గుటకిదె ప్రథమమయ్యె
తే. దర్శనానంతరము ప్రతిదర్శనమ్ము
నిచ్చుటయకాక ప్రత్యేకమేరుపడిన
ద్వారమున గౌరవాన్వితప్రభు గృహప్ర
వేశము గవర్నరొసఁగె భూవిభున కపుడు. 158

గీ. అలగవర్నరొసంగె మహాజనసభ
వారి గౌరవమునకయి వనవినోద
మందుఁ గలిసిరి మిగుల సఖ్యమునఁ దొంటి
విజయనగరాధిపతియు నీ పృథివిపతియు. 159

గీ. విజయనగరాధిపతియు బొబ్బిలి విభుండు
దమ ప్రభుత్వము చేసెడి సమయమందు
నొండొరులఁగూడి సంతోష మొందుటకును
నిదియ ప్రథమముగా గణియింపఁబడియె. 160

క. ఉత్తర హిందూస్థానపుఁ
బత్తనముల క్షేత్రముల నృపాలుఁడు చూడఁ
జిత్తమునఁ దలఁచి ముద మిగు

రొత్తఁగ విబుధాప్త భృత్యయుతుఁడై కదిలెన్. 191

సీ. కదలి బొబ్బిలినుండి మదరాసునకు నేగి
యచ్చటఁ బొగబండి నధివసించి
పునహా పురంబును బొంబయి పట్టణ
మును బరోడా జయపురము డిల్లి
యాగరా లక్నో మహాపురి మధుర బృం
దావనాయోధ్యా పురీవరమ్ము
లలహాబాదును వారణాశియు గయ కల
కత్తా పురమ్మును గటకము భువ
తే. నేశ్వరము జగన్నాథము నీమొదలగు
వాని సేవించె, గయలోనఁ బొలక జన
నికిని శ్రాద్ధము తగఁ జేసి నృపమణి కృత
కృత్యుఁడై నిజపురమున కేగుదెంచె. 162

మ. వినుతంబౌనల యాత్రలోపలనె శ్రీ విక్టోరియా చక్రవ
ర్తినికిన్ మూఁడవపుత్రుఁడై పరగు సుశ్రీరమ్యుఁ గన్నాట్ప్రభున్
ఘనుఁడై యప్పుడెసంగు రాట్ప్రతినిధి న్బంబై పురాధీశ్వరున్
జననాథాగ్రణి యర్హరీతిఁగని తత్సమ్మానితుండై తగెన్. 163

సీ. ధరణీతలేశుఁ డుత్తరయాత్రలను జేయు
తరి నయోధ్యయును బృందావనమ్ము
దర్శించి యచట సీతారాములయును రా
ధాకృష్ణులయు సువర్ణాకృతిగల
పాదుకల్గొని విధి చోదిత రీతిఁ బ్రా
ణప్రతిష్ఠాదులు నడపి తెచ్చి
పూజామహాలు నాఁగఁ బొలుచు మేడను బదు
నెనిమిదివందల యెనుబదియెని
తే. మిదవ యబ్దంబు నేప్రిలు పదునెనిమిది
యగు దినమునన్ బ్రతిష్ఠించి యర్చనాముఖ

మునను నిత్యార్చనము భక్తిపూర్వకముగ
జరపుచున్నాడు సచ్ఛ్యాగ్ర్యచారయుక్తి. 164
గీ. అనుదినమ్ము సహస్రనామార్చన పర
మాన్న నైవేద్య మొక్కరూప్యంబు మంత్ర
పుష్పమును రేపు మాపును బూజవేళ 165
లందు హరికీర్తనంబును నందు జరుగు.
సీ. ఇండియాదేశము నేలిన చక్రవ
ర్తిని జన్మతిథి వేడుకను ఘనుఁడగు
రాజప్రతినిధి యీ రాజేంద్రునికె చెల్లు
రాజ బిరుదమిచ్చెఁ బూజితముగఁ
నదిగాక వంశక్రమాగతమ్ముగ రాజ
బిరుదమ్ముగల్గిన ధరణినాథు
లెవరని ప్రశ్నము నిండ్యాప్రభుత్వమ్ము
వాగు చేయఁగ వీరి పాలనమ్ము
తే. దేశమున వచ్చినది మొదల్ దేశపతులు
రాజులని పూర్వులను గూర్చి వ్రాసినట్లు
తెలుపఁగల కాగితములు లేఖలును రాజ 166
వర్యుఁ డంపెఁ బ్రభుత్వమువారి కడకు.
సీ. అన్నియు సుపరీక్ష నరసి రాట్ప్రతినిధి
పదునెనిమిదినూర్ల పయిని దొంబ
దగువత్సరమ్మున నంత్యమాసమ్మునఁ
బదియారవది యా శుభదినమందు
వంశపరంపరాప్రాప్తంబుగా రాజ
బిరుదమ్మునిచ్చె బొబ్బిలికుటుంబ
ధరణీశులకు, నిల్లె యరసి విజయనగ
రము వారికి జయపురమ్మునకును
తే. వేంకటగిరికి మరియుఁ గాళ్వేటినగర

కాళహస్తి పిఠాపుర పాలకులకు
మరియు మలబారులోని భూవరులు కొంద
రికిని రాజబిరుదము నీరీతినొసఁగె. 167

గీ. పదియు నెనిమిదివందలపయి నెనుబది
యొనిమిదవయేట నక్టోబరనెడు నెలను
రాజవర్యుండు ప్రస్తుత రాజ్యలక్ష్మి
యగు మహారాణిఁ బరిణయమయ్యె నెలమి. 168

సీ. నారికేళ రసాల నారంగ పనసాది
నానాఫలద్రుమ మానితంబు
మల్లికా మరువక మాధవీప్రముఖ స
ర్వ ద్రుతలతాంత సంవాసితంబు
అమృతోపమాన పయః పరిపూర్ణ పు
ష్కరిణీవిహరమాణ జలవిహగము
సామజ ఘోటక స్యందనసంచార
యోగ్యరథ్యావితానోజ్వలంబు

తే. నై మనోహరమైన యారామ మొకటి
రాజధానికిఁ బశ్చిమప్రాంతభూమి
నిలిపి రాజవరుండు దానికిని రాజ
మోహనసమాఖ్య నన్వర్థముగ నొనర్చె. 169

చ. చెలువముగల్గు నల్లవనసీమను శిల్ప విశేష చాతురిఁ
బొలుచు విశాలహర్మ్యమును భూతలనాథవరుండు కట్టి రా
ణులు నివసింపఁగాఁ దగు మనోజ్ఞగృహంబుల నేర్పరించి సొం
పలరెడు దాని రాజమహలంచును బిల్వఁగఁ జేసె నిమ్ముగన్. 170

గీ. పదియు నెనిమిదివందలపయి నెనుబది
యొనిమిదవ వత్సరమ్మున నీ మహాభ
వనము వనమధ్యమున మహీవరుఁడు నిర్మి
తమ్ముఁ జేసెను మిగులఁ జిత్రమ్ముగాను. 171

గీ. అల మహోభవనంబు బొబ్బిలికి వచ్చు
గడుఁ బ్రసిద్ధులౌ నతిథులు విడియుటకును
మార్పునకు నప్పుడప్పుడు మనుజనాథుఁ
డేగి యుండుటకును నుపయోగ మొసఁగు. 172

1889-92.

సీ. అంత వేంకటగిరియందు రాజకుటుంబ
మున సహోదరులకు జనకునకును
వ్యావహారిక విషయమ్మునఁ గలిగెను
వైషమ్యములు గొన్ని వాని నణఁచి
సంధియొనర్ప నీ జననాయకుని వారు
కోరఁ దదర్థ మీ ధారుణీశుఁ
డరిగి వేంకటగిరి యందుఁ జెన్నపురిని
నాలుగునెలలుండి చాలయత్న
తే. మొనరించి కుటుంబపుఁ సొత్తులను యథార్థ
ముగ ననుభవింప నిర్ణయములు గలిగిన
కాగితము పుట్టఁజేసి యక్కలత దీర్చి
సంధికావించి వచ్చెను స్వపురమునకు. 173
సీ. ఆవత్సరము పూర్తి యగుటకుమును దమ
జనకుఁ డౌ వృద్ధరాజవరు పనుపు
వలనను దిరుగ నీ వసుధేశు డచటికి
జని తండ్రికిని నగ్రతనయునకును
వైషమ్యములు గడుఁ బ్రబల వారల నను
కూలపరుచుటకై చాల యత్న
మును జేసి యిబ్బంగి మూడువత్సరములు
వచ్చుచుఁ బోవుచు వ్యయము శ్రమముఁ
తే. నోర్చి కలతల నన్నిఁటిఁ దీర్చి వైచి
న్యాయసభలకు నెక్కి వ్యయప్రయాస

ములకు లోనయి చిక్కుల నలఁగకుండఁ
జేసెఁ దనవారి బుద్ధివిశేషమునను. 174

గీ. ఇట్టి ఘనకార్యమునకయి యితని మెచ్చి
చెన్నరాజ్యము మున్నైలి సీమనున్న
కాని మారా ప్రభుఁడు వేంకటగిరివిభు
పేర నొక లేఖ వ్రాసెను బ్రియముతోఁడ. 175

సీ. ఓనరనాథ! నీ యుత్తరమును గంటి
న్యాయసభాస్థలమందు బ్రకృత
మందున్న మీఁతగవబ్బురంబుగ నీదు
తమ్ముఁడౌ బొబ్బిలి ధారుణీశుఁ
డొనరించు యత్నమునను సంధిచేయంగఁ
బడెనని వినుటచే నెడఁదయందుఁ
గడుసంతసము నాకుఁగలిగె గుటుంబపుఁ
గలత లెంతయుఁ బీడఁ గలుగఁజేయు

తే. బొబ్బిలి నరేంద్రుఁపయి నాకుఁ బూర్ణమైన
గౌరవము గల దాతఁడు గడుఁ జతురుఁడు
మీఁతగవులోఁ బ్రవేశించి మిగుల మంచి
పనిమొనర్చెను జమ్ము భూపాలవర్య! 176

గీ. పదియునెనిమిదివందల పయి నెనుబది
యొనిమిదవయేడు మొదలుగ నీవిభుండు
గత విజయనగరేశుండు గలిసినప్పు
డెల్ల నతి మైత్రితోఁడ వర్తిల్లుచుండ్రు. 177

క. పదునెనిమిదివందల తొం
బదియొకటవ వత్సరమున బరివారముతో
మదరాసుపురికి నీ భూ
మి దయితుఁ డరిగి సుఖవృత్తి మెలఁగుచు నుండన్. 178

గీ. విజయనగ రాధిపతి యయి వెలయుచున్న

శ్రీమదానందగజపతి భూమివరుఁడు
వచ్చె నాకస్మికముగ నిప్పార్థివేంద్రు
గాంచి సంతసమునఁ బ్రసంగమ్ము సేయు. 179

క. దైవవశంబున నపు డీ
భూవరుఁడును నిజనివాసమున నుండుటచే
నావసుధేశుని గని సం
భావనమొయి నాదరించెఁ బ్రమద మెలర్పన్. 180

సీ. మఱుచటినాఁడె యిమ్మనుజేశుఁ డా రాజ
వర్యునిఁ గనఁ దన్నివాసమునకుఁ
జని యిష్టగోష్ఠిని జరపి విచ్చేసెను
నాఁడుమొదలు చెన్ననగరమందు
నొకరివాసమున కింకొకరుచని గోష్ఠి
జరపుచునుండి రీ వరుసగానె
యానందగజపతి భూనాథుఁ డీలోక
మును బాయునంతకుఁబోయె, నిట్లు
తే. విజయనగరమువారు బొబ్బిలికుటుంబ
ధారుణీశులుఁ దమ పూర్వ వైర ముజ్జ
గించి యన్యోన్యమైత్రి వహించి యొప్పు
చుండి రది యిప్పటికి సాగుచుండె మిగుల. 181

సీ. పదునేడువందలపయి నేబదెనిమి దౌ
నబ్దంబునందు భయంకరముగఁ
బూర్వపు బొబ్బిలి పురదుర్గమున సంగ
రమ్ము వర్తించె గాలమ్ము సనఁగ
నక్కోట గురుతులై నట్టి పెన్దిబ్బలు
క్రమముగ సమభూమిఁ గలియుచుండ
నచ్చోటి గురుతుకై యుచ్చ శిలాస్తంభ
మును నిల్పి దానిపైఁ బూర్వచరిత

తే. మాంగ్లభాషను దెలుగున నమరఁజేసెఁ
బదియు నెనిమిదిశతములపయిని దొంబ
దొక్కటవ వత్సరమున నీ యుర్వివిభుఁడు
నూతనాగతు లద్దానిఁ జూతు రెలమి. 183

గీ. పదియు నెనిమిదివందలపయిని దొంబ
దింటిపయి రెండవది యగు నేట రాట్ప్రి
తినిధి యగు లాండ్సు డౌన్ ప్రభుఁ గని కృతార్థుఁ
డయ్యెఁ జెన్నపురమ్మున నవనివిభుఁడు. 184

సీ. పదు నెనిమిదినూర్ల పయిని దొంబది రెండ
వదియగు నబ్దంబునం దగష్టు
నం దిరువదితొమ్మిదవ నాటి కెనయు నం
దనవత్సరమున భాద్రపద శుక్ల
సప్తమీశుభదివసంబున నిమ్మహా
రాజున కొక పుత్రరత్న ముద్భ
వించెఁ దత్సూనుండు వెలయును శ్రీరామ
కృష్ణ రంగేంద్రాఖ్యఁ గీర్తితుఁడయి

తే. యాతఁ డిప్పుడు క్రమవృద్ధి నంది, విద్య
లందుఁ గడిదేరి, కళలయం దారితేరి
సుగుణగణ పరిపూర్తిని సొంపుఁగాంచి
యొప్పుచున్నాఁడు సుజనుల మెప్పుగనుచు. 185

సీ. విక్టోరియారాజ్ఞి ప్రియపౌత్రుఁడైన యా
ల్బర్టు విక్టరు మహాప్రభువు చెన్న
పురికి విచ్చేయ నీ ధరణీశ్వరుఁడు పదు
నెనిమిదివందల యెనుబదిపయిఁ
దొమ్మిదియవ యేట నిమ్ముగఁ నతని ద
ర్శనము గావించె రష్యా మహాప్ర
భుని పెద్దకొమరుఁడు మనదేశమును గను

చుచు జెన్నపురమును జూడరాఁగ

తే. నమ్మహాప్రభువరు దర్శనమ్ముఁగూడఁ
బదియు నెనిమిదిశతములపయిని దొంబ
దొక్కటవవత్సరమ్మున నొప్పు మీరఁ
గా నొనర్చి కృతార్థత గనియె మరియు. 186

క. శ్రీధామకృష్ణభక్తుం
డా రాజవరేణ్యుఁ డగ్రహారముఁ జేసెన్
శ్రీరామకృష్ణపురమను
పేరున నొకగ్రామ మార్యబృందము మెచ్చన్. 187

క. పదునెనిమిదివందల తొం
బదిరెండవయేట నైదవనెలనుదగు ని
ర్వదియొకటవనాడు విభుఁడు
పదివృత్తులుగాఁగ నేరుపరిచెను దీనిన్. 188

గీ. అయిదు శతములమీఁదను నైదు పదుల
రావ్యములు వత్సరమునకు రాబడిగల
యగ్రహారోత్తమం బది యాశ్రితులకె
యెప్పటికి నను భావ్యమై యొప్పుచుండు. 189

1893

గీ. పదియు నెనిమిదినూరులపయిని దొంబ
దింటిపై మూడవదియగు నీ సువత్స
రమ్ము గడు ముఖ్య మిమ్మహారాజు రాజ్య
పాలనము చేయుచుండెడి కాలమందు. 190

సీ. ఈవత్సరమ్మున నేప్రిలునెలపదు
నాల్గవ తేదిని నగరివిడిచి
యూరపుఖండ యాత్రారతి వెడలికు
మారుఁడై నట్టి కుమార రాజ
వర్యుని నింగ్లీషుభాష నేర్పెడు నుపా

భ్యాయుపళమున మదాౢసులోన
విడిచి వేంకటగిరి వెలయు సోదరులును
మాతయు యాౢత్రానుమతి నొసంగ
తే. బొంబయిని ధూమనౌకను బూనఁగ నెక్కి
మార్సెలిసుతీరమునను స్టీమరును విడిచి
పారిసు పురమ్మునకు నేగి ధారుణీశుఁ
డచటి వింతలఁ గొన్ని నాళ్లరయుచుండి. 191
గీ. అచటినుండి ప్రయాణమై యవనివిభుఁడు
లండనుపురమ్ముఁ జేరెను నిండు మనము
తోడ మేనెలయందుఁ బందొమ్మిదియవ
తేదినను యాయిజనులు సమ్మోదమంద. 192
గీ. చెన్నపురనాథుఁడును గౌరవోన్నతుఁడును
నైన వెన్లాకు ప్రభు విండియాసచివుఁడు
లోనుగల గొప్పవారల కీనరేంద్రుఁ
బరిచితుని జేయుట కొసంగెఁ బత్రికలను. 193
గీ. తన కనుఁగు సోదరుండయి తనరుచున్న
వేణుగోపాలకృష్ణ భూవిభుఁడు చెన్న
పురమునుండియు నీ రాజపుంగవునకు
సహచరుండయి యుండె హర్షయుతుఁ డగుచు. 194
మ. అల లండన్పురిఁ జక్రవర్తినికి నూౘై నిల్చి యా యమ్మకున్
దొలిపుత్రుండగు వేల్సు భూవిభుఁడు సంతోషంబుతో నిచ్చె నొ
క్కలెవీ దానికి నీసహోదరులు వేడ్కన్ బోయి రద్దాని లో
పల సండ్యాసచివుండు పేర్కొనియె భూపాలోత్తమున్ సోదరున్.
గీ. సెంటుజేమ్సు మహాసౌధ సీమయందు
జరిగె నల్ల లెవీ, దాని కరుగ నితర
రాట్ప్రతినిధులు లోనగు రాజపురుషు
లరుగు త్రోవను బో వీరి కాజ్ఞ యయ్యె. 196

గీ. భరతఖండాధి రాజ్ఞియై పగగుతల్లి
జన్మదినమున జరుగు నుత్సవమునందు
జనిరి వీరు విదేశాంగసచివు సభకు
నచటి యాదరణోత్సవ మనుభవింప. 197

గీ. అల మహాపురమున బకింగ్‌హాము నాఁ
బరగు రాజగృహమ్మున జరిగినట్టి
రాచవిందులు రెంటికి రాజగాన
సభకు నొకదానికిని వీరు చనిరి వేడ్క. 198

క. ఆరాచవిందులకు మరి
యారాట్సంగీతసభకు నరుగుటకుఁ దగన్
గౌరవమునఁ బ్రత్యేక
ద్వారము నిర్ణీతమయ్యె ధరణీశునకున్. 199

గీ. వేల్సు ప్రభువర్యుఁ డొక్క పల్లికుభవన
మునకుఁ బునియాదుశిలను సమ్మోదమునను
వేయు నుత్సవమునను గేంబ్రిడ్జిప్రభువు
గౌరవమ్మునఁ బిలువంగ వీరు చేనిరి. 200

క. ఇమ్ముగ జూను నెలం బం
దొమ్మిదియవనాడు కడు ఘనుండగుచు సుధీ
నమ్మతుఁడగు గన్నాట్ ప్రభు
నిమ్మను జేంద్రుండు కనియె నెంతయు వేడ్కన్. 201

క. మును బునహా పట్టణమున
మను జేంద్రుని జూచి యుంట మఱువఁగ లేదం
చును గన్నాట్ ప్రభువర్యుం
డనె నట, సజ్జనులగురుతు లట్టివకావే.? 202

గీ. వేల్సుప్రభువర్యుఁ డొక తోటవిందొసంగఁ
జనిరి సోదరు లిరువుర చ్చటికి వేడ్క
జక్రవర్తిని నమ్మహోత్సవమునందు

జూడఁగాఁ గల్గునంచు నుత్సుకతదనర. 203
సీ. యార్క్ప్రభు వివాహ మగుటకు మును వధూ
వర దర్శనార్థమై జరిపెఁదోట
విందొక మహనీయుఁ డందుల కీ నరే
శ్వరుఁడు సోదరుఁడును నరిగి రందు
నిండియామంత్రి యీ యిరువుర నమ్మహా
ప్రభునకుఁ బరిచయపడఁగఁ జేసె
జాలయి పదియవ శుభదినమందుఁ బ్రి
న్సాఫ్ వేల్సు దర్శనమయ్యె వీరి
తే. కపుడు మిముఁ జూడ సంతోషమయ్యె ననుచు
నమ్మహాప్రభుఁ డానతీ నతనితోఁడఁ
బ్రభుపు లిటు దర్శనము కృపాపరత నొసఁగ
ధన్యులము మేమటంచు నీ మాన్యుఁ డనియె. 204
గీ. విండ్సరను పేరి కోటలోఁ బృథివి పతికిఁ
జక్రవర్తిని యొసఁగె దర్శనము జూల
యి నెలఁ బదునేడవదినమం దీవిషయము
నితఁడు దినచర్య గ్రంథమం దిట్లు వ్రాసె. 205
సీ. నాడు నా బసనుండి పాడింగ్టననియెడు
స్టేషను కేగ నాస్టేషనుకడ
నిండియాసచివుని యేడికాము యొకఁడు నా
కయి వేచియుండెను నతఁడు నేను
స్పెషలుబండిపయిని విండ్సరుకోటకు
బయలు దేరితిమి యా బండిలోనె
రాజకార్యపు సభాప్రముఖులు కొందరు
నడిచిరి స్టేషనుకడ నిలువఁగ
నచట నాకొఱకు రాజాజ్ఞ చే నంసిద్ధ
మగు బండిపయి నేను నతఁడు నెక్కి

తిమి దానికిని దురంగములు రెండమరె నం
దొక దానిపయిఁ గూరుచున్న మనుజుఁ
డా బండి నడిపించె నక్కోటలోపల
నొక భవనమ్మున నుత్తరువగు
దనుకఁ బ్రతీక్షింప నను నిల్పి రందు నా
కయి ఫలాహారమ్ము లమరియుండె
మూడుగంటలుగాఁగ మొదలయాటయు రాణి
గదివరకును నేడికాము నన్నుఁ
గొనిపోయె నచ్చటఁ గనిపెట్టి యున్నట్టి
ప్రభువు నర్ గలిసి శ్రీరాణిభవన
మునకు నర్ గొని తన ప్రోలను నిల్పఁగ
నతి దయారసమున హస్త మంటి
యామమ్మ నను గరుణార్ద్ర దృష్టిని జూచి
పరమాదరమున సంభాషణమ్ము
సలిపె నయ్యది కొంతతడవె యయ్యును శ్లాఘ్య
మయి దయాసూచకమగుచు నొప్పెఁ
బదపడి యారాణి పార్శ్వంబునందున్న
ప్రిన్సెస్ బియత్రిసర్ బిన్నకూఁతు
నకుఁ బరిచితుఁజేసె నను దయతోఁడ డె
బ్బదినాలుగేఁడుల ప్రాయముగల
వృద్ధయయ్యును నే ధరించిన యిండియా
దేశపు టుడుపుల దీక్షతోఁడఁ
బరికించె నారాజ్ఞి భాషణమ్ము దయార
సాప్లుతమైయుండె నదియుఁగాక
వాక్చమత్కృతియును వర్ణనీయంబయి
పగగె నేబదియారు వత్సరముల
నుండి ప్రభుత్వ మఖండముగాఁ జేయు

నీదేవిదర్శన మిట్లు నాకు
దొరకుట మిగుల సంతోషమ్ము గలిగెను
గౌరవమ్మును నధికమయి యొప్పె
నింగ్లండునకు నేగి యుండియాచక్రవ
ర్తిని యగు రాణి దర్శనము చేయ
వలెనంచు మదిలోన బాల్యంబునుండియుఁ
గోరికగల దది తీరె నేడు
అల రాజకీయ సభ్యులు నేను దరువాతఁ
గొంత కాలమునకుఁ గోటవిడిచి
స్టేమను కేతెంచి స్ట్రీమరుపై నెక్కి వ
చ్చితిమి లండనుపురిఁ జేర మరల
నింత దవ్వుననున్న యీదేశమునకు వ
చ్చిన నాకు నిప్పుడు తనివితీరె
నల మదరాసు రాజ్యమునుండి యీదేశ
మునకు వచ్చినయట్టి భూమిపతుల
తే. లోనఁ దొలుతటివాఁడను నేనె యనుచుఁ
జెప్పఁ దగియుండె నిటు లిష్టసిద్ధియగుట
నిష్టదైవము! వందనమిదె యొనర్తు
నిదియె నాజీవితమున సౌఖ్యద దినంబు. 206
సీ. ఇట్లు దర్శనము నరేంద్రున కిచ్చిన
కొలది దినములలోపలనె రాజ్ఞి
చేవ్రాలుగల తన చిత్రపటమ్ము భూ
పాలున కంపఁగఁ బరమభక్తి
నది యందికొని యమ్మహారాణిసచివుని
పేర నీతఁడు వ్రాసెఁ బ్రియమెలర్ప
శ్రీరాణి ప్రతికృతి చిత్రపటమ్మును
వందనమ్ములతోఁడ నందికొంటి

జూబిలి యుత్సవ సూచనగాఁగ బొ
బ్బిలి పట్టణమ్మున విపణి భవన
వాటిఁ గట్టించి యవ్వాటికి "విక్టోరి
యామార్కె"టనుచు నామాంకితమ్ముఁ
జేసితి నిప్పుడు శ్రీరాణి దర్శన
జ్ఞాపకమ్ముగను నా నగరమందు
బుర సభామందిరమును గట్టఁదలఁచితి
దాని "విక్టోరియా టౌనుహాల"
టంచును బిల్వఁగ నాజ్ఞయొసంగఁగఁ
బ్రార్థింతు శ్రీచక్రవర్తిని యిటు
కరుణించుటయు నాకుఁ బరమమహా బహుమతి
యిందుకై నేజేయువందనములు
తే. స్వామి భక్తిని, నాకృతజ్ఞతను యుక్త
సమయమున నర్హరీతి నాచక్రవర్తి
ని సముఖమ్మునఁ బలుకు సొంపెసగునట్లు
మనవిచేయుఁగఁ బ్రార్థింతు మంత్రివర్య! 207
గీ. ఇందుకు జవాబుగా నాతఁ డిట్లు వ్రాసె
నార్య! నీజాబు రాణి దివ్యసముఖమున
వినిచితిని నామె దర్శనమునకు జ్ఞాప
కముగఁ బురమందిరము మీరు కట్టఁదలచి
గందులకుఁ జాల సంతసమయ్యె ననియు
నద్ది "విక్టోరియా టౌనుహా"లటంచుఁ
బిలువఁబడుటకు నాజ్ఞను బ్రియముతోన
నుగ్రహించితి ననియు సంతోషవార్త
మీకుఁ దెలుపంగ నను నియమించె నధిప! 208
గీ. యార్కుప్రభువర్య రాణికి నల వివాహ
కాలమునఁ బనితరమున మేలిమిగల

దంతపుంబేటి నంపె నీతండు, దాని
బ్రమదమునఁ గొంటిననుచు నా రాణి వ్రాసె. 209

గీ. రాజవర్యుఁడు శ్రీమహారాణికి నొక
దంతపుంబెట్టె నర్పించె సంతసమున
"సెంటు మెరి" వైద్యశాల కిచ్చెఁ బదియేను
నూరు రూప్యముల్ చందా నుదారమతిని. 210

క. జనపతి ప్రధాన సచివుఁడు
మును గాఁ గలవారి భవనముల కుత్సవపుం
దినములఁ జని నిండ్యామం
త్రిని మహనీయులను గొందరిన్ దర్శించెన్. 211

గీ. ఉత్సవపువేళలం దట నున్న రాజ
వంశజులఁ గొందరిని బ్రభువరులఁ గనియె
బ్రైటనాక్స్ఫర్డు బెడ్ఫర్డ్ పురములెడింబ
రో పురిసి జూచివచ్చెను భూపవరుఁడు. 212

సీ. జనపతి యంత లండనుపురమును వీడి
యూరపుదేశమందొప్పుచున్న
పారిసు లూసరన్ ఫ్లారెన్సు వెన్నిసు
రోము పట్టణములఁ బ్రేమఁగనుచు
బ్రిండిసీసంద్రంపురేవున స్టీమరు
పయినెక్కి కదలి బొంబయి పురోత్త
మంబును జేరె సెప్టంబరు రెండవ
తేది నచ్చట బైలుదేరి చెన్న

తే. పురమునకు వచ్చి సంతోషభరితు లయిన
యనుచరులు వెంటరా నగ్రతనయుఁ దోడు
కొని సురక్షితముగఁ బురమ్మునకు నెలమి
వచ్చె నన్నెలఁ బదుమూడవదినమందు. 213

సీ. ఆ వత్సరమ్మున శ్రీవేణుగోపాలు

నాలయావరణంబు నందొకదెస
రెండాలయములు నిర్మించి ప్రత్యేకంబ
యయ్యాలయమ్ములయందు నొక్క
దానిలోపలను సీతారాముల మరి రా
ధాకృష్ణుల మరొక్కదానిలోన
బాంచరాత్రోక్త సత్పద్ధతిని బ్రతిష్ఠి
తులఁజేసి యాదేవతలకు నిత్య
తే. పూజ ప్రత్యేకభోగంబు మొదలగునవి
జరపుచున్నాఁడు నేఁడును జనవిభుండు
రాణి దర్శనమునను శ్రీరామకృష్ణ
సేవ నీయేఁడు ధన్యతఁ జెందె నిట్లు. 214

1894

మ. అల మద్రాసుగవర్నరుర్ ఘనతరుండై నట్టి వెన్లాక్ ప్రభుం
డిల తే జెంతయు వేడ్కతోఁ బిలువఁగా నేతెంచె, నమ్మేటి బొ
బ్బిలిచెంతర్ దనరారు రాజమహాలర్ బేరెన్నికం గన్న సౌ
ధలలామంబున నుండె సర్వవిధ సత్కారంబులర్ దృప్తుఁడై. 215
ఉ. వచ్చిననాడె సూనుఁడును బార్థివుఁడుర్ జని యమ్మహామహుర్
బొచ్చెము లేని కూరిమిఁ గనుంగొని వచ్చిరి వారి వెంబడిర్
వచ్చి యతండు కోటకు, నృపాలునకుం బ్రతిదర్శనంబుఁ దా
నిచ్చి బహూకరించె మది నెంతయు మోదము మేదురంబుగార్.216
సీ. వెన్లాక్ప్రభుండు శ్రీ 'విక్టోరియా' టౌను
హాలునకుర్ బని యాదుశిలను
వేసెడివేళ నీవిధమునఁ బల్కె, "రా
జవరేణ్య ! మఱియును సభ్యులార !
గతవత్సరమున నింగ్లండునకేగి శ్రీ
చక్రవర్తిని గని సరగ నామె
సందర్శనమునకు జ్ఞాపకంబుగఁ గట్టు

హార్థ్యమ్మునకుఁ బునియాదుశిలను
వేయఁగ నను మీరు వేడుకతోఁ గోర
నటుజరిగించుట కమితహర్ష
మందితి నేను, దత్సందర్శనజ్ఞాప
కంబుగ నీపనికంటెఁ జాల
ననువగుదాని మీ రాచరింపఁగఁ జాల
రనుచు నేఁ దలఁచెద నందువలన
నిందుకుఁగాను నే నిచటికివచ్చి యీ
పునియాదుశిలవేయు టనవధియగు
నానందమును దృప్తి నందించె నాకు, శ్రీ
చక్రవర్తినియెడ స్వాంతమందు
మీకున్న భక్తికి మీఘనవిశ్వాస
మునకు నెల్లపుడును గనబరచెడు
ప్రభుభక్తిఁ గనఁజేయు భవదీయ సత్కుటుం
బమ్ముల యుక్తప్రవర్తనలకు
శాశ్వతమగు నిదర్శనముగ నీభవ
నము చెలంగును మీమనమునఁ దలఁచి,
నట్టి యికార్య మీ ప్రాంతమండలివారి
కత్యనుకూలమై యలరుచుండు
నిచ్చటికే నిట్లు వచ్చినవిషయము
సీమలోనున్న మహామతులకుఁ
దెలుపుచు నందు నీదేశసంబంధమౌ
ప్రతివిషయంబునఁ బరమమైన
ప్రీతియు నాదరవృత్తియు నామది
గలదంచు, మఱియు బొబ్బిలిపురమున
ననుసరించినవారి కావశ్యకోపకా
రము లొనర్పఁగ ననురక్తి గలిగి

చక్రవర్తినియెడ సర్వదా ప్రభు భక్తి
సంప్రీతిఁగనఁజేయు సంతసపడు
తే. నొక్క ప్రభువర్యుఁ డిమ్ముగ నుండెననియుఁ
దెలుపఁగలవాఁడ, మఱియు నీ దివ్యసమయ
మందు మిముఁ బొగడుటకంటె నధిక మేను
నేర నీహాలు స్థిరమయి నెగడుఁ గాత!" 217
గీ. రాజమహాలులోన రాతిరి నరపతి
విందొసంగి యపుడు వేడ్కఁ జక్ర
వర్తినియును నల గవర్నరు నారోగ్య
మందవలయుననుచు ముందుకోరె. 218
గీ. దానికిని బ్రతిగా నల మాననీయుఁ
డన్న రేంద్రుని యారోగ్య మపుడు కోరు
చును మృదు మధురవాక్య గుంభనము మెరయఁ
బలికె నీ క్రింది విధమునఁ బార్థివేంద్రు. 219
మ. "అనవద్యంబుగఁ బూర్ణమైన దయ నా యారోగ్యముఁ గోరు మీ
కును, దానిం గడు నాదరం బమరఁగాఁ గొన్నారికిం జేతు వం
దనముల్, మీరొక కొన్నిరోజులకు ముఁ రమ్మంచు నన్ గోర, నీ
దినమందే నిచటన్ బునాదు శిల నెంతే వేడ్కతో నాటుటన్
ఘన సంతోషముఁగల్గె నా కనుచు వక్కాణింతు రాజోత్తమా! 220
మ. ఇదె యిచ్చో నొకపట్టణంబు ఘనమౌ నెస్టేటునుం జాల నే
ర్పు దగన్ బాగుగ రక్షితంబులగుచున్ బొల్పొందు, రాష్ట్రంబు సం
పద సౌఖ్యంబును దుష్టి గల్గు ప్రజచే భాసిల్లుఁ, బల్మారు ని
య్యది నాకున్ దెలియంగవచ్చెఁ గడుఁ దథ్యంబైన వృత్తాంతమై. 221
చ. అనయము శ్రద్ధతో నిజ జనావళిసేమము లాభమున్ గనుం
గొనుచు నెసంగుచున్న నృపకుంజరు లీరని నా కెఱుంగన
య్యె, నిది నిజంబు గావున నరేంద్ర! ప్రభుత్వము పత్నిమూని వం
దనముల నే నొనర్చెద మనఃపరిపూర్తి యెసంగ నీయెడన్. 222

చ. ఒనరఁగ మీ తెరంగునని యుత్తరపుల్ సరకారులందుఁ గ
ల్గు నరవరేణ్యు లెంతయును గోరిక నీమ కొకప్పుడేనియున్
జని యలదేవిఁ గన్గొని నిజంబుగఁ దత్ప్రభుపీఠమందు భ
క్తిని ననువృత్తి నెంతయును దెల్లముచేయుదురంచుఁ గోరెదన్.

చ. నను దయతోడ నీవిధమునన్ గడు సత్కృతినందజేయుటన్
మనుజవరేణ్య! నే బ్రిటిషుమండలనాథుల మారుగాను వం
దనము లొసంగుకొంటిను ఘనం బగుదానిని జేయఁ జాల, నీ
యనువున నాదురాక కడుహర్షము సౌఖ్యముఁ గూర్చె నాకిటన్.

క. మును బొబ్బిలి యుద్ధము నడ
చినచోటను రాజవరునిచే నిర్మితమై
తనరెడుఁ గంబముఁ జూడన్
జనె వెన్లాక్ప్రభువు మరుదినము వరువాతన్. 225

క. జనపతి నిర్మింపఁగఁ దల
చెను వైద్య గృహమ్ము నొకటి స్త్రీలకు నచటన్
బుని యాదుశిలను వేయుట
కును వెన్లాక్ప్రభువు నతఁడు కోరెఁ బ్రియమునన్. 226

సీ. అట్లు ప్రార్థితుఁడయి యా వైద్యశాలకుఁ
దన రాణికిని మారుగను బునాదు
శిలను స్థాపించుచు శ్రీగవర్నరు పల్కె
" నీపని చేయుట కిపుడు మీరు
నను గోరు టానందమును గూర్చె, నా పత్ని
యీ యుత్సవమునకై యిచ్చటికిని
వచ్చుటకును వీలుపడమికిఁ జింతింతు
స్త్రీ వైద్యశాలల వృద్ధికొఱకు
మీ కుటుంబమువా రమేయధనం బిచ్చి
రందు మద్రాసు మహాపురమున
స్త్రీ వైద్యశాలకుఁ గేవల వేంకట

గిరిరాజవరుని యాగియె దృఢావ
లంబమాటను మీ కుటుంబమువారల
కభిరుచి యిట్టికార్యములఁ గలదు,
ఇది నిర్మితంబైన పిదప స్త్రీలకుఁ జాల
యాధారమై యలరారఁ గలదు
దీనిని గనుగొన్న మాననీయుల కిట్టి
పనులు మీవలెఁ జేయ ఘనతరమగు
తే. నుత్సుకత యిదియొనగూర్చుచుండు, నిట్లు
మానవతులకు నుపయుక్తమైన పనులు
చేయుటకు మార్గదర్శకులై యొసంగు
చుంటచే మిమ్ముఁ గొనియాడుచుంటి" ననుచు. 227
గీ. ఆదినమ్మున సాయాహ్నమందు శ్రీగ
వర్నరు ప్రయాణమై రాజవరుని వీడు
కొని విజయనగరమునకుఁ జనియె నిచటి
సత్కృతికిఁ జిత్త మెంతయు సంతసింప. 228
ఉ. మానవనాయకుండు నల మానవతీజన వైద్యశాలయుఁ
దానికిఁ జెంత వైద్యవనితానిలయంబును గట్టి శాశ్వతం
బై నెగడంగ వింశతి సహస్ర ధనంబును దద్గృహమ్ములుఁ
బూని విశాఖమండలపు బోర్డు నధీనముఁ జేసె నర్మిలిన్. 229
మ. మును వైశాఖపురిం గలెక్టరగుచుం బొల్పొంది యీ మండలం
బున కెన్నే నుపకారముల్ జనులు సమ్మోదంబునుం బొందఁ జే
సిన టర్నర్ దొరపేర సుస్థిరగతిం జెల్వొందు సత్కార్యముం
జననాథాగ్రణి చేయఁ డంచుఁ గడు నుత్సాహంబుఁ గల్గించుటన్.
చ. జనపతులుం మహాజనులు చాల ధనంబును గూర్చి యప్పురం
బునకుఁ బ్రయోజనార్థముగఁ బోయెడు వారలకుం వసింపఁగా
ననువగు సత్ర మొక్కటి పురాంతరసీమను గట్టఁ జేసి ర
ప్పనికయి షట్సహస్రములు పార్థివవర్యుఁ డొసంగె రూప్యముల్.

1895

క. పదునెనిమిదివందల తోం
బదియైదవ వత్సరాదిఁ బార్థివవర్యుం
సదయుయయి నైట్ కమాండరు
పదాంకితుని గాఁగఁ జక్రవర్తిని చేసెన్. 282

సీ. వెన్లాక్ ప్రభుండు భూ విభు నలంకృతుఁ జేసె
బిరుదంబుచే నీలగిరులయందు
మే నెల ముప్పదౌ మానిత దినమున,
నచట నీ విధము లైనట్టి యుత్స
వమ్ములు జరగుట కిమ్మహోత్సవమె యా
ద్యమ్మయి యొప్పె, నయ్యవసరమున
శ్రీమద్బరోడా మహీమహేంద్రుండును
విచ్చేసియుండె, బొబ్బిలికి రాజ
తే. వరుఁడు సను దేర, మన్నన పత్రమును ప్రబ
జలు సమర్పించి తమదు కోర్కులను దెలుప
నన్ని యొకసారి తీర్చుట కనువు పడునె?
క్రమముననను దీర్తునంచు వాగ్దాన మొసఁగె. 283

క. జనపతి తత్సందర్భం
బున ముప్పదివేల రూప్యముల రయితులపైఁ
గనికరమున రిమిష నొసఁగి
యనుగ్రహము చూపెఁ బ్రజ్ఞలౌనని మెచ్చన్. 284

క. ఘనతరుఁడయి యెసగెడు నెలి
జను పేరిటి రాట్ప్రతినిధి చెన్నపురికి వ
చ్చిన వచటికిఁ జని తద్ద
ర్శనముఁ గావించివచ్చె జనపతి మరలన్. 285

గీ. అల్ల రాజప్రతినిధి యిల్లాలి పేర
నొక్క శయ్యను స్థాపించె నుర్విభుఁడు

స్త్రీల యుపయోగమునకయి చెన్నపురి నె
సంగు విక్టోరియా వైద్యశాలయందు. 236

1896

గీ. పదియు నెనిమిదివందల పయిని దొంబ
దారవది యైన యబ్దంబునందు భూమి
వరుఁడు వెన్లాక్ప్రభూత్తము పత్ని పేర
శయ్య స్థాపించె నల వైద్యశాలయందు. 237

గీ. అంగనలకయి బొబ్బిలియందు నిర్మి
తంబయిన వైద్యశాల నవంబరునెల
మూఁడవదినమ్మున విశాఖపురి కలెక్ట
రైన 'హారను' తెరచె భూజాని కోర. 238

గీ. చెన్నపురి శాసనమ్ములు చేయు సభను
ధరణినాథుల పక్షమై తనరుచుండ
మెంబరుగ నియమించె నిమ్మేదినీశ్వ
రుని గవర్నరు, సామర్థ్యమునకు మెచ్చి. 239

1897

క. పదునెనిమిదివందల తొం
బదియేడవ వత్సరమున వచ్చెను క్షామం
బది తీర్పఁగఁ జందాగను
బదివేల ధనంబు నొసఁగెఁ బార్థివుఁడు దయన్. 240

ఉ. అన్నము పానముల్ దొరక కంగదనొందుచు వచ్చు బీదవా
రిన్నరభర్త తా సదయ దృష్టిఁ గనుంగొని రాజధాని యం
దున్న యనాథసత్రమున నొప్పుగ నన్నమొసంగుచుండి యా
పన్నత మాన్పె నక్కఱవు పట్టినకాలము తీరునంతకున్. 241

క. చెరువులు లోనగునవి కడు
విరివి యొనర్చుటకుఁగానుఁ బృథివీశుఁడు తా
నిరువదివేల ధనం బ
క్కఱవున వినియోగపరచె గాటముగు దయన్. 242

క. నిరుపేదల కాశ్రితులకుఁ
బరిజనులకుఁ జౌకధరను బరమకరుణతో
ధరణిపతి ధాన్యమొసఁగుచుఁ
బరిపరివిధములను బ్రోచెఁ బ్రాజ్ఞులు మెచ్చన్. 243

మ. వినుతప్రక్రియ సర్వదేడులు చనఁగ విక్టోరియాచక్రవ
ర్తిని రాజ్య వ్యవహారముల్ నడుప, భక్తిఁ వజ్రపుం జూబిలీ
యను పేరి వేడుక దేశజుల్ సలిపి రయ్యెచోట్ల న య్యుత్సవం
బున దర్బారును జేసె బొబ్బిలిపురిఁ భూజాని యుత్సాహియై. 244

ఉ. ఆసభకుఁ బురింగల మహాజను లందరుఁ బూర్ణభక్తి వి
శ్వాసములొప్ప వచ్చి రటఁ బార్థివవర్యుఁ డొసంగె భక్తి వి
న్యాసముతోడివాఙ్మయము నాపయి సభ్యు లనేకమా నుప
న్యాసము లిచ్చి రీవిధమునఁ గడు నుత్సవమయ్యె నయ్యెడన్. 245

గీ. అల్ల సంతోషసమయమునందు నొక్క
మన్ననపుఁబత్రమును జాల మంచి పనిత
రమ్ముగల వెండిపెట్టియ నిమ్ముపరిచి
పంపి రల రాజ్ఞికిని భక్తి పెంపు మీర. 246

గీ. వేంకటగిరి నరాధీశు ప్రియసుతుని వి
వాహమునకేగి యాతఁ డప్పార్థివునకు
ముద్దు కృష్ణ విభునకును మొనసి యున్న
కలతలను దీర్చి వైచెఁ బెండిలికి మున్నె. 247

1898

చ. జనపతి కోరఁగాఁ గడుఁ బ్రశంసకు నెక్కు హావిలాక్ప్రభుం
డనెడు గవర్న రయ్యెడల నాదరమొప్పఁగవచ్చె రాణిపే
రున నగరంబులోపలను గ్రొత్తగఁ గట్టినయట్టి దానుహా
లును దెరువంగ రాజమహలుఁ బసగా నరనాయకుం డిడెన్. 248

క. పదునెనిమిదివందల తొం
బదెన్మిదవయేటఁ బ్రిబవరి నెలయందు

ర్వాదియొక్కటవ దినమ్మున
సదమలగుణుఁడైన యితఁడు చనుదెంచె నిటన్. 249

క. ఆరాత్రి విందులోఁ దన
యారోగ్యము గోరి నరవరాగ్రణి పలుకం
గా రాజధానిపతి విభు
నారోగ్యముగోరి యిట్టు లనియెం బ్రతిగాన్. 250

మ. అనివార్యం బయినట్టి ప్రేమమున నా యారోగ్యముం గోరుచుం
దనుభూషించుచు యుక్తవైఖరి నెయి న్భాషించుటం మీకు వం
దనమర్పించెదఁ డౌనుహాలు దెరువం రాజోత్తమాహ్వానమే
నను నీ యుత్తర రాజ్యభాగములకుం రప్పించె నిక్కంబుగన్. 251

మ. అవకాశంబు పొసంగెనేనియును నీ ప్రాంతమ్ములం గాంక్షమై
నవలోకింపఁ దలంపు నాకుఁ గల దట్లైయుండఁగా ని మ్మహో
త్సవముం గూరిచి మాటయిచ్చుటను మద్యానంబుమార్పంగ న
న్యవిధంబౌ నుపపత్తి చేకురక యుంటం వచ్చితిం బైనమై. 252

క. ఐనఁ బ్రయోజనముల కను
వౌనట్టులె కాలనిర్ణయముతో నీ దే
శాన కిటువచ్చి నేఁడీ
భూనాధుని యతిథి నౌటఁ బొందితి ముదమున్. 253

గీ. ఇచ్చటికి నాదు ప్రియయును వచ్చెనేని
యింతకంటెను ముదమందు నృపతి సంది
యమ్ము లేదైన నీతఁ డన్నట్లు దూర
యాత్రయే కాక సత్వర యాన మగుటఁ
గూడ రాఁజాలదయ్యె నక్కోమలాంగి
యేను గూర్చుండుటకు మున్నె యిన్న రేంద్ర
చంద్రు నారోగ్యమును గోరి సభ్యులార !
యాసవము గ్రోలఁ బ్రార్థింతునయ్య మిమ్ము. 254

సీ. ఈబొబ్బిలినరేంద్రుఁ డీ దేశమందలి

యుద్ధమ్ములందుఁ బ్రసిద్ధమగుచు
నీ రాజ్యచరితలో నెన్నంగఁదగిన స
ద్వంశమం దుదయించి తత్ప్రతినిధి
యై యుండె, విద్యాసమర్థుఁడు దేశాట
నమ్మునఁ గడు నిపుణమ్ముగాఁగ
నరయువాఁడును గడు నధికమౌ నేలకుఁ
బ్రభువయి దాని నేవగిది నిండు
లాభముతోడఁ బాలనముచేయఁగఁ జను
నా విధమెఱింగిన యట్టివాఁడు
చట్టముల్ సేయు నా సభయందు మదరాసు
రాజధానిని గల రాజవరుల
ఘన లాభమును దెల్పఁ గలుగు నమూల్య స
భ్యుండయి యీ విభుఁ డుండె ననుచుఁ
తే. జెప్పఁ గలవాఁడ, నిజముగఁ జెన్నరాజ్య
మునను మఱియు హిందూదేశమునను గూడ
నీ నరేంద్రునివంటివా రెందరేని
గలుగు టభిమతమని చెప్పఁగలను నేను. 255
క. మరునా డుదయమున గవ
ర్నరుదర్శనమునకు నేగి రాజవరుఁడు రా
నరు దెంచె నమ్మహాత్ముఁడు
నరపతికిన్ మారు దర్శనమ్ము నొసంగన్. 256
ఉ. తోరపు వేడ్కతోడుత నెదుర్కొని క్రొత్తగ గట్టినట్టి ద
ర్బారు మహాగృహంబున సభక్తికభంగిఁ బ్రియంబుతోడ స
త్కారము లర్హ్వమై ఖరి దగన్ నరపాలుఁ డొనర్పఁగొంచుఁ దాఁ
బోరసభాగృహంబుఁ దెరువంగ మహామహుఁ డాతఁడున్ జనెన్. 257
గీ. అల గవర్నరు విక్టోరియానభాభ
వనమునను డైనుపయి నుండఁ బోర్థివుండు

దాని దెరువు మటంచుఁ బ్రార్థనముచేసి
వెండిబీగము నర్పించెఁ బ్రియముతోడ. 258

సీ. ఈసభా భవనము నీ నరాధీశుండు
కట్టించుటకుఁ గల కారణంబుఁ
దచ్చరిత్రమును వ్యక్తముచేసె నిందుగఁ
గాన బ్రసిద్ధిని గన్న పూర్వ
డా గవర్నరుచేత నారబ్ధమైన యీ
పని పూర్తి గావింపుమనుచు నన్నుఁ
గోరుటచే మోద గౌరవమ్ములు నాకుఁ
గలిగిన వను కంటెఁ గలదె యొకటి

తే. దీనిఁగట్టించుటకుఁగల యీనరేంద్రు
తలఁపునెంతయు మెచ్చి తీ నిలయము పుర
జనుల కెప్పుడు నుపయుక్తి నెనయుఁగాతఁ
దెరచితిని యీ గృహామునంచుఁ దెలియఁ జేతు. 259

క. అని మృదుమధురోక్తుల న
య్యనఘుఁడు వచియించె నలగృహామునందె పురీ
జనులును రాష్ట్రీయులును మ
న్ననపత్రము నమ్మహాత్మునకు నర్పింపన్. 260

సీ. అందుకు వందన మర్పించి యాతఁ డీ
బొబ్బిలి నరపాలపుంగవుండు
సదుపయోగముగల్గి చాల యమూల్యంబు
లైన యనేక కార్యములు మీకుఁ
జేసియుంటకు మీరు చేసిన సంస్తవ
మెంతయు నాకును దృప్తి యొసఁగెఁ
బాఠశాలలు ధర్మ వైద్యశాలలు జలా
ధారమ్ములును మరి ధర్మ్యములగు
నెన్నని లాభమ్ము లిన్నగరమ్మునీ

రాష్ట్రంబునను గల్గు ప్రజల కెలమిఁ
గలిగించెనని మీరు తెలియఁజేయుటయె వి
వేకమహితుఁడైన విభునకును గృ
తే. తజ్ఞతాపూర్వకంబైన స్తవము గాదె
యాతఁ డౌదార్య మెసఁగ మి మ్మరసి ప్రోవ
నేదియును బ్రార్థనీయంబు లేదటంచుఁ
బలుక నెంతయు మోదంబు గలిగెననియె. 261
చ. బలితపుఁ గర్వుచే మిగుల బాధలనొందెడు నాశ్రితాళి భృ
త్యులను బురీసమీపమున నుండెడు వారిని భూవరుండు ని
స్తుల కరుణావిశేషమునఁ జూచి యథార్థముల్లైన సాయముల్
సలుపుటకై గవర్నరు ప్రశంస యొనర్చెఁ బ్రభుత్వపక్షమై. 262
గీ. దొరతనమువారి యున్నతోద్యోగు లట్టి
కష్టసమయమ్మునందుఁ బల్కాడక తోడఁ
బ్రజకు సాయ మొనర్చుటఁ బ్రస్తుతించె
దొరతనము పక్షమున గవర్నరు ముదమున. 263
క. అంతట యుద్ధపుఁ గంబముఁ
గాంతాజన వైద్యశాలఁ గాంచి యతఁడు భూ
కాంతుని వీడ్కొని నాటి ది
నాంతమ్మున నేగెను విజయనగరమునకున్. 264
గీ. తూర్పుసౌధంబు నగ్రపుత్రున కొసంగి
మేదినీ నాయకుండు లక్ష్మీవిలాస
మనఁగఁ బశ్చిమదిశఁ గట్టినట్టి హర్మ్య
మునను వసియించె నేప్రిలు మొదటినుండి. 265
క. అల వత్సరమ్మునం దే
ప్రిలు నెల మధ్యమ్మునందుఁ బెద్దకొమరుఁడై
పొలుచు యువరాజునకు భూ
పలలాముఁడు పెండ్లిచేసె వైభవ మెసఁగన్. 266

సీ. ఆవివాహామునకు భూవరు మాతయు
వేంకటగిరి పృథివీపతియును
నవరోధయుతుఁ డయి యుల ముద్దుకృష్ణ యా
చేంద్రుండు, వేంకట కృష్ణ విభుఁడు
వేంకటగిరినుండి విచ్చేసిరి, పిఠాపు
ర కుమారరాజ పుత్రికులలోన
రెండవఘనుఁడును శ్రీవేణుగోపాల
కృష్ణ భూవిభుఁడును హృష్టు లగుచు
తే. చెన్నపురమునమండి వచ్చిరి మరియును
సంగమ వలస భూపాల స త్తముండు
వచ్చె నాహూతులగు గొప్పవా రనేకు
లచ్చటచ్చట నుండియు వచ్చి రెలమి. 267
సీ. పదునెనిమిది నూర్ల పయిఁ దొంబదెనిమిదా
వత్సరమ్మున నాల్గవ నెలను బదు
నాలవ తేదికి న్సమమా విలంబివ
త్సర చైత్ర కృష్ణపక్షంపు సప్త
మీ గురు యుత నిశ మీనలగ్నమునఁ గు
మారరాజవివాహ మహము బంధు
బుధ మిత్రు లెంతయు మోదముతోఁ జూడ
జరపి మహీపతి పరిణయాగ
తే. తులకుఁ దగురీతి సత్కృతుల్ సలిపి భూరి
దక్షిణల నన్నమున విప్రతతిని దనిపి
యున్నతోద్యోగు లాదిగ నన్ని తెగల
వారి నలరించె సర్వసత్కారములను. 268
క. ఘనుఁడైన గవర్నరు శా
సన నిర్మాణసభయందు సభ్యపద మొసం
గెను మరల నరేంద్రున కీ

యనఘుని సామర్థ్యమునకు నభినందితుఁడై. 269

గీ. నీలగిరిలోపలను జూను నెలను జరిగి
నట్టి సభకేగి సామర్థ్య మచ్చుపడఁగ
రాజవర్యుఁడు మదరాసు రైతువారి
బిల్లు నెదిరించి భాషించె నెల్లగతుల. 270

1899

గీ. పదియు నెనిమిది శతములపయిని దొంబ
దింటిపయిఁ దొమ్మిదగు నేట నేనవ నెల
నవనిపతి ప్రపితామహి యైన లక్ష్మి
నరసమాంబిక వైకుంఠనగరి కరిగె. 271

చ. పరమపవిత్రవర్తనము భాగవతప్రతిపత్తియుఁ సదా
హరిగుణకీర్తనాంచిత సమస్త పురాణకథానుషక్తి దు
శ్చర నియమావలంబనము సాఁగఁగఁ దొంబదివత్సరంబు లి
ద్ధర మని యుండె నల్ల వనితామణి గణ్యయ కాదె యేరికిన్. 272

క. తన పౌత్రుని పౌత్రుండయి
తనరిన యిప్పటి కుమార ధరణీశ్వరునిన్
గనుగొనియె నిట్లు జరగుట
ఘనతర సుకృతంబుగాదె గణన యొనర్పన్. 273

క. నరనాథున కీమెయెడన్
దిరమగు గౌరవము గలదు దీని కతమునన్
బరమ శ్రద్ధాభక్తుల
జరపె నితం డీమె కపుడు శ్రాద్ధ క్రియలన్. 274

గీ. పరమ పావనియైన యీ భవ్యపేరఁ
జెన్నపురమున నొప్పెడు స్త్రీలవైద్య
శాలలో శాశ్వతమ్మగు శయ్య యొకటి
నిలిపె నెంతయు భక్తితో నృపవరుండు. 275

మ. అల వైశాఖపురీ మహాజనులు తన్ బ్రార్థింప విక్టోరియా

లలనాషష్ఠిసమావనోత్సవము దెల్పఁగ మేటి టౌనుహాలు నా
స్థలమం దొప్పఁగఁ గట్టి యిచ్చుటకు వాగ్దానంబుఁ గావించె భూ
తలనాథుం, డది నిర్మితంబగుచు నేతన్నామమ్మునఁ దాల్చెడున్.276

1900

క. నవదశ శత తమ సమయం
దవనీపతి పారిసు పురమందలి నంతన్
సవిమర్శముగఁ గనుగొనన్
దివురుచు నింగ్లండు కేగ నిశ్చయ పరిచెన్. 277

గీ. ఐనఁ దద్వత్సరమ్మున మేనెల తుది
యందుఁ బ్రపితామహీ ప్రథమాబ్దికమ్ము
వచ్చుటను నటమీఁదఁ దుపాను లరబి
యా జలధిలోనఁ దగులునంచరుగమానె. 278

క. ఈమను జేశ్వరు నేప్రిలు
లో మూడవసారి కౌన్సిలున మెంబరుగా
నేమించె ఘనతఁ జెందిన
యా మదరాస్ రాజధాని యధిపతి ప్రీతిన్. 279

గీ. పాచి పెంటకు దరిఁ గొండ వాండ్రు గూడి
కొని పితూరిని జేయ నెక్కొనిరి దాని
నడప దొరతనమునకు సహాయుఁ డగుదు
నని కలెక్టరు కిటు వ్రాసె జనవిభుండు. 280

సీ. ఈలోన నిరువురు పోలీసు భటులను
గెడిపిన యా కొండకిరించుమూఁక
గూరిచి మీరు సాలూరు వచ్చితిరని
యును రిజర్వుజవానులును విశాఖ
పురినుండి వేగవత్తురటంచు వింటిని
జెంతనె నేను వసించి యుంటఁ
దగు సహాయత దొరతనమువారి కిపుడు

చేయఁ గోరెద నా సిపాయిలును వె
లమవారు మీకుఁ జాలఁగ నుపయోగింతు
రని కాదు నా మది హత్తు కొన్న
ప్రభు భక్తిఁ గనఁబరుపఁగ నాకునవకాశ
మును దయచేయఁ బ్రార్థనమొనర్తు
గతకాలముననిట్టికార్యమ్ములను ప్రభు
భక్తిని గనఁబరుపంగ నాదు
పూర్వుల కవకాశమును మునుపటివారు
దయచేసి యుండిరి త్తిరుణమందు
బర్వతమ్ములమీద భారముల్ మోయఁగ
నేనుఁగులును దంతిలేని యట్టి
కలహస్థలంబునఁ గల వార్తలను దంతి
కడకు వేగమ్మున నడపుటకయి
గుఱ్ఱపు రౌతులఁ గోరినచోఁ బంప
సిద్ధమైయుంటి సమిద్ధచరిత
అని వ్రాయ నాతఁ డిట్లని వ్రాసె, నీ నెల
యైదవతేదిని నధిప మీరు
వ్రాసిన లేఖలో వ్యక్తమై యుండెను
సమయానుకూలమగా సాయ మొనరఁ
జేసెద ననుచు, నేఁ జేసెద దానికి
స్వాంతపూర్వము లగువందనముల
నవసరమైనచో భవదీయ సాహాయ్య
మును గోరెద ననుచు నున్న మీకుఁ
తే. దెలిపితిని ప్రస్తుతం బట్టితెరఁగు గలుగ
లేదనుచుఁ జెప్పెదను జాల మోదమెసఁగ
దొరతనమువారి కిపుడె సంతోష మలర
నీ విషయమును దెలియంగ నే నొనర్తు.

చ. జనవర మీరు వ్రాసినప్రసంగము నేఁ దెలియంగఁజేయఁగా
ననువున రాజభక్తి యుతమై తగుసాయ మొనర్తునంచు మీ
రనుటను వందనమ్ములు సమర్పణచేసితిమంచు వ్రాయఁగా
నను నియమించె నా దొరతనమ్ము ముదమ్మున మీకుఁ దెల్పితిన్.

క. జూనునెల నాలుగవనా
డీనృపతిపేర వ్రాసె నీ విధమునఁ దా
మానిత విశాఖమండల
మానా డేలేడి కలక్టరతిహర్షితుఁడై. 282

క. నరనాథుం డేతద్వ
త్సరమునఁ బెనుగఱవురాఁగఁ దద్వారణకై
కరుణమెయిం బంచసహ
స్రరూప్యములు తా నొసంగెఁ జందాగాఁగన్. 283

క. జనపతి బీదల సత్ర
మ్మునకయి కట్టించె భవనమును, విక్టోర్యా
జననతిథియందు నడపిం
చెను దాని ప్రవేశ మహము చిత్తమెలర్పన్. 284

సీ. ఇప్పటికి నరేంద్రుఁ డిరువదియేడువే
లేడువందల డెబ్బదేడు రూప్య
ములు ప్రతివత్సరమును వచ్చు భూములు
గ్రామముల్ గొనె, వాని క్రయధనమ్ము
ఆరులక్షలపయి నరయఁ దొంబదినాల్గు
వేల రూప్యములయి వెలయు, నుత్త
రపుసరకారుల నృపు లనేకులకుఁ బ్రో
ప్రైటర్లకును జాలవరకు ఋణము

తే. లొసఁగె శ్రీరాణి జూబిలి యుత్సవముల
యందు మరికొన్ని సమయములందు నాల్గు
లక్షలవరకు రూప్యముల్ రయితులకు రి

మీమనులుగా నొసంగెను మిగుల దయను. 285

క. ఘనుఁడగు రాట్ప్రతినిధి యీ
యనఘుండగు భూపతికి మహారాజ యటం
చును బిరుదు చక్రవర్తిని
జనన దినోత్సవమునం దొసంగెను దయతోన్. 286

చ. మనుజవరేణ్యుఁ డెన్నఁదగు మంచి కితాబును నిట్లు పొందుటన్
మనముల భక్తిహర్షముల మానములై పెరుగంగఁ బట్టణం
బునఁ గలవారు రాష్ట్రీయులుఁ బొందుగఁ బౌరసభాగృహంబునన్
ఘన సభ చేసి యప్పు డభినందన పత్ర మొసంగి రర్మిలిన్. 287

క. ఘనమగు నీ యుత్సవమున
కును జిహ్నముగాగ ధనముఁ గూర్చి పురి దరిన్
దనర 'మహారాజా పా
ర్కు' నెడు జనోద్యానముంచి రంచితభక్తిన్. 288

చ. "జన నుతులార మీదయ యొసంగెడు మన్ననపత్రమంది వం
దనముల నాచరించెద మనఃపరిపూర్తిగ, శిల్ప చాతురిన్
దనరిన వెండిపెట్టె యిది తా నొకజ్ఞాపకమై యొసంగు నీ
ఘనమగు నుత్సవంబునకు, గాటపు వేడుక నిండునట్లుగన్. 289

చ. ననునొక కొంతసంస్తవ మొనర్చియు నీ మన చెన్నరాజధా
నిని మును బ్రోచినట్టియును నెమ్మది నిప్పుడు ప్రోచుచట్టియున్
ఘనులు గవర్నరుల్ దయను నన్నునుగూర్చి ప్రశంసచేసిన
ట్టి నుడులె యిందుఁ బొందుగ ఘటించుటచే ముదమందితిన్ గడున్.

ఉ. ఈసమయమ్ము గుర్తుగను నేదియొ నే నొనరింతునన్న వి
శ్వాసము మీ మనమ్ముల ధ్రువమ్ముగనుంటనె యిందులోపలన్
వ్రాసితి రెద్దియైన మిముఁ బ్రార్థనచేయఁగ లేదటంచు నే
నీ సమయమ్మునందుఁ దగ నేది యొనర్తునటంచుఁ జూడఁగా
నా సహధర్మచారిణి స్వనామము మీకు నొసంగుదానికిన్
జేసిన సంతసింతునని చిత్తమునన్ గలకోర్కె దెల్పుటన్. 291

గీ. తీవనులు నెరవేరఁగ హిందు బాలి
కలకు నొక పాఠశాలను నిలిపి దాని
కిని మహారాణి నామాంక మొనయఁ జేసి
మీ కొసంగుటకంటెను మేలిమిగల
కార్య మీవేళ నొక్కటిఁ గాన నేను. 292
గీ. పాఠశాలలఁ గ్రైస్తవుల్ బాలికలకు
నేర్పరించిన పలుచోట్ల హిందుబాలి
కలకుఁగూడను బొఠశాలల గవర్న
మెంటు వా రేర్పరించుట మీ రెఱుఁగుదు
రందుచే నీపురంబున ముందు నేను
నిలుపఁబోవున దిటఁ గ్రైస్తవులు నిలిపిన
బాలికా పాఠశాలకుఁ బ్రతిఘటించు
నట్టిదిగ నుండ నేరదటంచుఁ దలఁతు. 293
ఉ. నానగరంబునందుఁ గల నాగరికాగ్రగణులార నాపయిన్
బూను దయానురాగములు బొంపిరివోవఁగ నిచ్చటన్ జనో
ద్యానము నాదు పేరఁ దగినంత ధనం బొనగూర్చి నిల్పఁగాఁ
బూనితి రింతలోనె యలపూవులతోట మహోపథంబులన్
లోనలరారు త్రోవలును లోనుగ సిద్ధములౌను నేత దు
ద్యానము దీని చిహ్నముగ స్థాపనచేయుట వందనమ్ము లెం
తేనియు మీ కొనర్తుఁ, బగ లెంతయుఁ గృత్యము నిర్వహింప నా
గ్లాని దినాంత వేళను దొలంగ విహారమునల్పనిత్యమున్
జానగుచోటుగా నిది యొసంగును మీకని నేఁ దలంచెదన్. 294
ఉ. ఏ నికఁ జెప్పఁబోవునది యెంతయు మీకు ముదంబుఁ గూర్చెడున్
గాని యొకింత యాత్మ నుతిగాను గనంబడుఁ జెప్పకున్న మీ
మానసవృత్తులం దది సమంబుగ నాటదు గాన నిప్పు డ
ద్దానిని నేవచింతు నవధానముతోడుత నాలకింపుడీ. 295
గీ. మున్ను నే బాల్యమునఁ బదుమూడు వత్స

రముల ప్రాయంబునం దున్నసమయమందు
దలఁచుకొంటిని జీవితదశను నిర్వ
హింపఁ గోరిన కోర్కు లైదింటి మదిని. 296

సీ. భరతఖండమునెల్లఁ బాలించు శ్రీ చక్ర
వర్తిని దర్శింపవలయు ననుచు
నైటు కమాండరన్ ఘనమైన బిరుదము
వహియించి యొప్పఁగవలయు ననియు
శాసన నిర్మాణసభలోన నొకసభ్య
పదవినిగొని యుండవలయుననియు
అల ప్రభుత్వమువారివలన మహారాజ
పదమును గైకొనవలయుననియు

గీ. నిట్లు నాలుగు కోరిక లింక నైద
వయది కేవల దైవికంబగుటఁ జేసి
యదియు నిండుగ నెరవేరు నంత మీాద
వ్యక్తమగు నిద మిద్ధమటంచు మీాకు. 297

చ. ఘనుఁడగు మత్పితామహుఁడు కాలవశంబును బొందునప్డు మ
జ్జనకున కానతిచ్చిన ప్రశస్తము లౌ నుడులే కితాబులన్
గొనఁ బురికొల్పె నన్ననుచు నొక్కి వచించెదఁ దండ్రిమాట చొ
ప్పున నడువంగ నాయనకుఁ బోలదు జీవిత మల్పమాటచే. 298

గీ. ఎల్లవారికిఁ దమపూర్వు లిచ్ఛగించు
పనులు నెరవేరుచుట విధిప్రాప్తమైన
దనుచు మీారందఱును నెఱిఁగినయదికద
యందు నస్మాదృశులమాట యడుగనేల. 299

క. ఘనమగు దయతోఁడను మ
న్నన పత్రము నిట్లు మీారు నా కొసఁగుట నో
జనముఖ్యులార నే వం
దనమును మరియొక్కసారి తగ నొనరింతున్." 300

క. తనదు ప్రజలు భక్తి మెయిన్
దన కొసఁగినయట్టి మన్ననపుఁ బత్రమునం
ది, నరేంద్రచంద్రుఁ డీవిధ
మున దానికి నుత్తరమ్ము పొసఁగ నొసంగెన్. 301

క. కరజను ప్రభుండు మదరాస్
పురమున కరుదేర రాజముఖ్యుండు డిసం
బరునెల నల రాట్ప్రతినిధి
దరిసెన మప్పురమునందుఁ దా నొనరించెన్. 302

క. అరుగంబోవు గవర్నరు
తరుణీమణిపేర శాశ్వతంబగు శయ్యన్
ధరణీశుఁ డుంచె మదరాస్
పురి గాంతావైద్యశాలఁ బొందు దలిర్పన్. 303

1901

సీ. ఏకాతపత్రమై యెసఁగంగ నిండియా
దేశమే యతివ తా దృఢత నేలె
నై దుఖండంబులయందుఁ బ్రభుత్వంబు
పరగించెనే రాణి ప్రబలశక్తి
రాజులు మరి మహారాజులు మొదలుగాఁ
బ్రభుభక్తిఁ గొలిచిరే పరమసాధ్వి
నినుఁ డస్తమింప డే వనితామతల్లి పా
లించు దేశమ్మున నెంచి చూడ

గీ. నట్టివిక్టోరియా రాజ్ఞి యస్తమించె,
ననెడు దుర్వార్త వినవచ్చె నశనిభంగి
నపుడె యాఫీసు లఖిల విద్యాలయములు
మూయఁబడె దేవతాలయములను గూడ
వాద్యములు నాటిదినము నిల్పంగఁబడియె. 304

గీ. పనులమెయిఁ గోటలోనికి వచ్చువారు

తలలపయి వేష్టనమ్ములు దాల్పకుండ
వలయునని యాజ్ఞయయ్యె ముప్పదియునొక
టగు పిరంగులుఁ గాల్చి ర య్యవసరమున. 305

గీ. మఱియు నదిమొదల లామె సమాధి దివస
మువరకును నవుబత్తు నీ మొదలుగలుగు
నిత్యవాద్యము లన్నియు నిలుపఁబడియె. 306

గీ. చక్రవర్తిని యుద్యోగిసమితి కేరు
పడిన దుఃఖసంసూచక వాసరముల
యందు సంస్థానికోద్యోగులందఱును న
రేంద్రుఁడుఁ దదీయ చిహ్నగా నెడమ కేలఁ
గట్టిరి వినీలవస్త్రంపు ఖండములను. 307

చ. జనపతి యాంతరంగిక విషాద విశేషము నప్డు సార్వభౌ
మున కెఱుఁగంగ జేయు టది ముఖ్యముగా మదిలోన నెంచుచున్
ఘనుఁ డయినట్టి చెన్నపురనాధునకున్ మన చక్రవర్తి చెం
తనె గడు కార్యదర్శికిని దా నపు డంపెను దంతివార్తలన్. 308

గీ. మఱియు నాప్రభురాలి సమాధిదినము
నందుఁ బాండ్రింకువందలమంది బీద
వారికన్న మొసంగె భూపతి ప్రభుత్వ
చిహ్నముగఁ బొద్దుపోకతోఁ జనరదియగు
నట్టు లేకోత్తర శతమ్ములగు ఫిరంగు
లేసిరి ధ్వజమ్ము డిగియెను శాసనమున
మార్చినెలలోపలను బంచమదినమందు
దివికిఁ జనినట్టి చక్రవర్తిని మిమోరి
యలుసభను విభుఁ డిట్లుపన్యాసమిచ్చె. 309

చ. "మన మిటఁ జేయుకార్యము సమగ్రవిషాద నిదానమయ్యె భూ
జనుల దృఢానురాగము పొసంగ సుపూజితమైన చక్రవ
ర్తిని మరణమ్ముచేఁ గలిగె దీర్ఘవిషాద మసహ్య దుఃఖమున్

మన కవి శైలుపర్చుటయు మానుగ భృత్యుల ధర్మమాట ని
ప్పనికయి వచ్చినార మిది భావములం దలపోసి చూడుడీ. 310

సీ. పదునెనిమిదినూర్లపయిని బందొొమ్మిదౌ
వత్సరమ్మున నైదవ నెలను నిరువ
దిటిమీఁద నాలవదినమున నుదయించి
పదునెనిమిదినూర్లపయినిముప్ప
దేడవవర్షమం దెసగు జ్యేష్ఠమాసంబు
నిరువదియవనాఁడు పరగ రాజ్య
భారముఁ దాల్చి యర్వదిమూఁడువర్షమ్ము
లేడుమాసములపై నిరుదినములు
రాజ్యమ్ము నేలి శ్రీరాణి యీజనవరి
యం దిరువదిరెండవది యగుదిన
మునను సాయంకాలమున నారుగంటల
వరకు శ్రీసర్వేశునకిక నరిగె
తే. నందుచే నామె రాజ్యమునందలి ప్రజ
లందఱును జాల దుఃఖమునంది రిచట
నామె సుగుణగణమ్ముల నంద ఱెఱుఁగ
రైన నివ్వార్తఁ గడు శోకమలము వినిరి. 311

గీ. ప్రభువు నడువడి యోగ్యయౌ పత్నిరీతిఁ
దల్లివర్తనమునఁ గూడఁ దలఁచిచూడ
నితరులను బోల్చుట కొకింత యెడ మొసఁగని
గుణగణమ్ముల నీయమ గణనకెక్కె. 312

చ. కలిని సహస్రమాసముల కాలముదాక సజీవులైన వా
ర లతిపవిత్రమూర్తులయి ప్రాలుదు రట్టి మహాత్ము లున్న చో
టులకును బోయి వారలఁ గదుర్ గడుభక్తిని బూజసేయుఁగా
వలయు నటంచు శాస్త్రములు పల్కును దద్విధి నెంచిచూడఁగా
నిలనయిఁ జాంద్రమాసముల యెన్నికచేత దశోత్తరంబులై

వేలయు సహస్రమాసములు విశ్రుతవైఖరి నుంట కాక యి
క్కలియుగమందు నీ భరతఖండము నేలిన తొంటి రాజవ
ర్యులకును మేలుబంతియయి యొప్పిన యీ ఘనురాలి నమ్మదా
దులు మఱి యెంతభక్తి వినుతుల్ పచరించుట మేలొ చూడుడీ 313

మ. మును త్రేతాయుగమందు విష్ణుఁ డలరాముండై భువిన్ యోగ్యుఁడౌ
జననాథుండును భర్తయున్ సుతుఁడు నే చందంబునన్ వర్తిలన్
జను సన్మార్గము చూపె, నవ్విభుని కాంతారత్న మీచక్రవ
ర్తినియై తా జనియించి రాజ్ఞియును బత్నీరత్నమున్ దల్లియున్
జనలోకమ్మున నెట్టిసద్గుణములన్ వర్తించునో తద్విధం
బును జూపించె నటంచు నేఁ దలఁతు సభ్యుల్ మీరునున్ దీని నే
యనుమోదింతురుగాతఁ దన్మహిమ లత్యాశ్చర్యమున్ గూర్చుటన్.

ఉ. ఇచ్చటనున్నయట్టి మన యిందఱిలో నల రాజ్ఞిపోకకై
హెచ్చగు వంత నాకుఁ జనియించెను జిన్నతనంబునుండి నా
యిచ్చను గల్గు కోర్కులగు నేనిటిలోఁ దొలుదాని దీర్పఁగా
నచ్చటికేగి విండ్సరు గృహంబున నా ప్రియమాతఁగాంచి
నే వచ్చితి నట్టి నాకు బలువంత జనింపదెయిట్టులాటకున్. 315

చ. అల మదరాసుపట్టణము నందలివారలు టౌనుహాలులో
పల సభచేసి యం దుపసభన్ సమకూరిచి యందుఁ గల్గు వా
రలు దివికేగినట్టి యల రాణికి జ్ఞాపకమౌట కేపనిన్
వలనుగ నిశ్చయించి రది పట్టుగఁ జేయఁ దలంచి రింతలోన్. 316

గీ. కాన జనులకు ననుకూలమైన యట్టి
పనికిఁ జందాల నొసఁగుచు మనముఁ గూడ
నచ్చెరువు, ప్రేమ, భక్తి, భృత్యతయుఁ, జక్ర
వర్తినియెడలఁ గనఁబరుపంగవలయు. 317

సీ. కడుఁ బ్రసిద్ధచరిత్రఁ గల మనపురిఁ జక్ర
వర్తిని పేర జ్ఞాపకముగాఁగ
నొకటి యేదియొ లేక యుంటకు నామది

రొప్పదు కావున నిప్పు డట్టి
దానికి మిమ్ముఁ జందాల నిమ్మని యడు
గుదునంచుఁ దలఁపకుఁ డెదలలోనఁ
దగ వరులార యద్దానిని నేనె మీ
కు నొసంగఁ దలఁచితి కోరి వినుఁడు
తే. అదియె విక్టోరియా జ్ఞాపకార్థ పుస్త
కాలయమ్మని తెలియుఁ డయ్యది యిచటను
జక్రవర్తినిపేర నెసంగు పురస
భాగృహమ్మున స్థాపింపఁబడును ముందు." 318
గీ. అల మహారాజ్ఞి పాలనమందు రాజ
వర్యుఁ డిరువదియేఁడులు వసుధనేలె
నగుట నిరువదివేల రూప్యంబు లొసఁగె
నావె జ్ఞాపకము లగు కార్యమ్ములందు. 319
గీ. రాజవర్యుండు చెన్నపురమునఁ జక్ర
వర్తినీ నామమునఁ దగు పౌర మంది
రమ్మునకు నొకవేయి రూప్యమ్ములను నొ
సంగెఁ జందా నుదారమహా స్వాంతముననను. 320
సీ. శార్వరినామవత్సర ఫాల్గున విశుద్ధ
ప్రతిపదంచిత భౌమవాసరమున
కెనయయి యొప్పెడు-నేకో త్తరైకోన
శతతమకై ్రస్తవశక సువత్స
రమునఁ బిబ్రవరిమాసమున నిర్వదియవ
శుభదివసమ్మున సుసమయమందు
శ్రీమన్మహారాజ శేఖరునకుఁ బౌత్రుఁ
డుదయించెఁ బ్రజలు సమ్మదముఁ బొందఁ
తే. పౌత్రలాభమ్మునను వార్షవశతనొంది
నృపతి యతనికి శ్వేతాచలపతి రామ

కృష్ణ రంగేంద్ర నామాంక మొనయఁ జేసి
పెంపఁ గ్రమవృద్ధి నందుచు వెలయు నతఁడు. 321

గీ. పార్థివ వరుండు కోర్టాపు వార్డ్సు బిల్లు
చట్టముల నిర్మితిని జేయు సభకుఁ దెచ్చు
నవసరమునం దగస్టు మాసాంతమందు
నీలగిరిలోనఁ జరుగు కౌన్సిలున కరిగె. 322

సీ. డైమండు జూబిలీ నామకోత్సవసూచ
నార్థమ్ముగను బానుహాలునందు
నిలుప లండనునుండి నృపతి దెప్పించెను
శ్రీ చక్రవర్తిని చిత్రపటము
జిల్లాకలెక్టరై చెలఁగినయైలింగు
ఘనుఁడు భూనాథు ప్రార్థనముచేత
నక్టోబరునెల యందలి తొమ్మిదవతేది
దెరచెనుదానిపై తెరను దీసి




తే. ముప్పదియొకటా ఫిరంగులు ముసుఁగుదీయు
నంతలో మ్రోసె సభయెల్ల హాలునందు
నిండుకొనియుండెఁ గన్నులపండువుగను
రాణి చిత్రపటంబును బ్రజలుగనిరి. 323

గీ. ఘన మహారాజ బిరుదమ్ము గన్నకతన
రజత గజవాహనమ్మును రాజవరుఁడు
బొబ్బిలీనగరమున సుపూజితుఁడగు
వేణుగోపాలునకు సమర్పించె భక్తి. 324

సీ. మున్ను బొబ్బిలి యుద్ధమున ఘనశౌర్యమ్ము
చూపి యశమ్ముచు జూరఁగొన్న
తాండ్రపాపయ్యనా దనరు వీరాగ్రణి
పేరసుస్థిరముగ వెలయునట్లు
పట్టణమ్మున వెల్మవారులోనగువారు

ధనమును సమకూర్చి దానివలన
వెలమ వీధిని శిల్ప విభవంబు విస్తృతి
మెరయుసావడిని నిర్మించి పిదప
తే. దత్ప్రవేశోత్సవమ్మును దగనడపఁగ
ధారుణీనాధ వర్యుఁ బ్రార్థనముచేయ
నడపె నయ్యుత్సవము వారు హర్షమంద
నుత్సుకుండయి యివ్విభుఁ డొక్కనాఁడు. 325

1902

గీ. ఆమ్ తిహిలటన్న పేరున నలరినట్టి
రాజధానీశు దర్శింప రాజవరుఁడు
చని యథావిధి నమ్మహాఘనుని దర్శ
నమ్ము నొనరించెఁ జెన్నపురమ్మునందు. 326
గీ. చట్టములు చేయు సభలోన సంస్కరింపఁ
బడిన దై యున్న కోర్టాపు వార్డ్సుబిల్లు
సభ్యజనుల విమర్శంబు చాలనొంది
శాసనమ్ముగ వచ్చె నా సమయమందు. 327
క. తిరుపతి శ్రీరంగములకు
నరిగెను మాతయును శ్రీమహారాణియుఁ దో
నరుదేర యాత్రకయి భూ
వరుఁడు యథార్హ మయినట్టి పరివారముతోన్. 328
సీ. ధారుణీశుండు గోదావరీమండల
మున నొప్పు కిర్లమపూడి యనఁగఁ
బరగు నెస్టేటులోపల నర్థభాగమ్ము
నా రెము పూడియన్ బేరఁ దనరు
చున్న యెస్టేటులో నొకటి మూడవ భాగ
మును గొనియెను గ్రయమునకు లక్ష
లెనిమిదిపైఁ దొంబదేనుసహస్రముల్

షష్ట్యధికంబైన శతమునొసఁగి
తే. యొక్కలక్షపై ముప్పదియొక సహస్ర
ములును బంచశతంబును విలువయిచ్చి
మఱియుఁ గొనియెఁ జెంగల్పట్టు మండలమున
జెలఁగు తిరువూరటన్న యెస్టేటుకూడ. 329

గీ. శాసనమ్ముల నిర్మించు సభను మరల
నాలుగవసారి యల గవర్నరుఘనుండు
పరమసంతుష్టుఁడయి సభ్యపదము నొసఁగి
గారవించెను ధారుణీకాంత వరుని. 330

చ. స్తుతమతి యామ్తిహిల్ ప్రభువు చొక్కపుఁ బ్రేమసిఫార్సుచేయ రా
ట్ప్రతినిధి చక్రవర్తి మకుటమ్ము ధరించెడు నుత్సవంబునన్
బ్రతినిధిగాఁగఁ జెన్నపురరాష్ట్రము పక్షమునందు ధారుణీ
పతి నల లండనన్ బురికిఁబంపుట కేర్పరచెన్ బ్రియంబునన్. 331

చ. ఎనసిన వేడ్క భూమి వరుఁ డేప్రిలు నిర్వది నాలుగౌ దినం
బున నగరంబు వీడి యలబొంబయితీరమునం దరేబియా
యను బొగయోడ నెక్కి చని యాపయి మారిసెలిస్ పురమ్ము రే
వున డిగి పారిసన్ బురిని బొందుగ నల్పదినమ్ములుండి లం
డనుపుర మిర్వదేడవ దినమ్మున మేనెలఁ జేరె నిమ్ముగన్. 332

గీ. ఇండియా మంత్రిసభనుండి యేగుదెంచి
నట్టి కెప్తాను స్మిత్తనునాతఁ డెదురు
కొనియె విక్టోరియాస్టేషనున నరేంద్రుఁ,
దోడుకొనిపోయె నొక బండితోడ బసకు. 333

గీ. సెంటు జేమ్సు మహాసౌధసీమయందు
జరగిన లెవీకి భూవరుఁ డరిగియుండె
మరి బకింగ్హాము రాచనగరున జేయఁ
బడిన సభకును జనియె నిష్పార్థివుండు. 334

సీ. అల చక్రవర్తి ముదలచే నెరల్ మార్ష

లనునాతఁ డతిథుల కందఱకును
మకుట ధారణ మహో మహమున కాహ్వాన
పత్రికల్ వేర్వేరఁ బంపె, జూను
నిరువదిరెండవ వరదినముననుండి
'లండనుపురి మరల విడుమవర
కాహూతు లగువార లందఱనతిథులు
గా నేరుపడిరియా జూనునిరువ
తే. దారవదినమ్మునను జేయ నేరుపడిన
యమ్మకుటధారణోత్సవ మాగిపోయె
సార్వభౌము శరీరమస్వస్థదశను
గాంచి రుగ్ణతనందిన కారణమున. 335
గీ. అందుచే నాఁటి దిన ముత్సవావలోక
నార్థమై పాదిరిగుడికి నరుగఁదగిన
వారిలోన ననేకు లిప్పార్థివుండుఁ
గూడ సెంట్ జేమ్సు పాలిసు గుడికేఁ జనిరి
ప్రభువు నారోగ్యమును గూర్చి ప్రార్థనలకు. 336
చ. వినుత గుణోత్తరుండయిన వేల్సుప్రభుండు తదీయ పత్నియుఁ
ఘన కుతుకంబుతో భరతఖండమునల్ దెసలందునుండి వ
చ్చినయతిథిప్రధానులకుఁ జేసిరి మన్నన హస్తమంటుచుఁ
మనమలరంగఁ గొంచెముగ మాటలనాడుచు సెంటుజేమ్సు నాఁ
జను భవనోత్తమంబునకు సమ్మతివా రలఁ బిల్చి యచ్చటన్. 337
గీ. ఇండియామంత్రి సభవారి యేరుపాటు
వలన రాజేంద్రుఁడును దక్కువారుఁగూడ
స్పితెడునకుఁ బోయి యచ్చట బ్రిటిషువారి
యోడబలమును గాంచిరి యుక్తగతిని. 338
ఉ. అమ్మనుజేశ్వరేశ్వరున కామయశాంతి యొసంగ దైవ యో
గమున, నాభిషేచ నీక కార్యము దీర్చుటకై యగస్టుమా

సమ్మునఁ దొమ్మిదొ సుదివసమ్ము వినిశ్చితమయ్యె, దచ్ఛుభం
బిమ్ముగఁజూడ నీయతిథిబృందము వేడుకఁ గాంచియుండఁగన్. 339

గీ. అపుడు పాదిరి గుడిలోని కరుగుత్రోవ
ముందు నున్నట్టి మిద్దెలో ముందరిదెస
నున్న పీఠంబులపయిని నుండి యుత్స
వమ్ముఁగాంచిరి ప్రతినిధుల్ సమ్మదమున. 340

చ. జనపతి యిండియాసచివు సమ్మతి విండ్సరు కోటలోనికిన్
జని, గత చక్రవర్తినియు నాథుఁడు నిల్చిన యా సమాధులన్
గని నిజ భక్తిసూచకము గానొక గుండ్రని పూలదండ నా
జనని పదాబ్జసన్నిధిని జక్కఁగ నర్పణచేసి యప్పురం
బును గలయంగఁజూచి నృపముఖ్యుఁడు లండను జేరె వేడుకన్. 341

సీ. మకుట ధారణ మహామహము దీరిన వెను
కను బకింగ్‌హాము నగరున నిండి
యా సైనిక గణమ్ము నల సార్వభౌముండు
తిలకించునప్పు డీదేశపుఁ బ్రతి
నిధులెల్లఁ బ్రత్యేక నిర్దేశపూర్వక
మ్ముగఁ దెల్పఁబడి రవ్విభునకు, నతఁడు,
హిందూ ప్రతినిధుల కందఱకును గౌర
వమున్ మెడల్సు నా నెగడు వెండి

తే. పతకముల నిచ్చె వేర్వేర స్వకరమునను,
సైనిక భటుల కెల్ల నొసంగె వెండి
పతకముల వేల్సు భూవరుఁ డతిముదమున
వేరువేరుగ, వారును వినతిఁ గొనిరి. 342

గీ. అచటఁగల గొప్ప ప్రభువుల యాలయముల
జరిగిన మహోత్సవమ్ముల సమయములను
వారిచే గౌరవమునఁ బిల్వఁబడి యేఁగి
కనియె నయ్యుత్సవమ్ముల జన విభుఁడెడు. 343

గీ. అతిథులు స్వదేశమునకేఁగ ననుమతిగొన
నిండియా మంత్రి సన్నిధికేఁగ నతఁడు
దర్శనము నొక్కొకరికిని దగ నొసంగి
నైజ రూప పటమ్ము లందఱకునిచ్చె. 344

చ. ఎనిమిదియైన మాసము పదేనవదై తగు వాసరమ్మునన్
జనపతిలండనున్ విడిచి సమ్మతిఁ బారిసు పట్టణమ్మునన్
దినయుగమున్ జినోవయను టీవిఁ దనర్చిన యూర నాలుగా
దినములు నిల్చి మార్సెలిసు తీరమునన్ బొగయోడ నెక్కి చే
రెనవలిమాసమందు స్వపురిన్ దగ నష్టమ వాసరంబునన్. 345

క. మనుజ పతి పంపె నభినం
దనపత్రము మకుటధారణపు సందర్భ
మ్మునరాజత పేటికయం
దునిచి మహాసార్వభౌమునొద్దకు భక్తిన్. 346

గీ. అట్లు పంపుటచేఁ జాల హర్షమంది
వందనమ్ములు శ్రీచక్రవర్తి యొసఁగుఁ
చుండె నని ప్రతిపత్రిక యిండియా గ
వర్నమెంటు దయామతి బంపె నిటకు. 347

చ. అల మకుటాభిషేక సమయమ్మునకున్ దగుచిహ్న గాఁగ బొ
బ్బిలి నగరమ్మునందుఁ బృథివీపతి వైద్యగృహానుబంధియై
యలరు గృహమ్ము రోగులకునై యొసఁగన్ నడపెన్ గుమార భూ
తలపతి తత్ప్రవేశ సువిధానముఁ దచ్ఛుభవాసరమ్మునన్. 348

గీ శ్రీకుమార మహారాజ శేఖరునక
గష్టు నెల నిర్వదా తేదిఁ గలిగె నొక్క
పుత్రి యాయమ్మ క్రమవృద్ధిఁ బొలిచిలక్ష్మి
నరసమాంబాభిధానయై పరగు నిపుడు. 349

సీ అంత డిల్లీపురియందుఁ గాఁబోవు ద
ర్బారున కయి మదరాసు దొరత

నమువారు పిలువంగ నరవరుండు కుమార
 ధరణీశుతో డిసంబరునెలఁబది
యేడవ తిథిఁ బురి వీడికల్కత్తాను
 హా రాజధానికి సవలినాటి
కరిగి జోతీంద్ర మోహన టాగురనెడు మ
 హారాజవర్యునకతిథియగుచు
తే. గొలది దినములు గడపి యా నెలను నిరువ
 దైదవ దినమ్ము డిల్లికి నరిగి చెన్న
 రాష్ట్రీయులకయి యొప్పు డేరాల వరుస
 నున్న నిజపటగృహమున నొప్పవిడిసె. 350
మ. జననాథుండు కుమారయుక్తుఁడయి యుత్సాహంబునన్ గారనే
 షనుదర్బారునకేగి చెన్నపురరాజ్యస్వామి లోనౌ మహా
 జన బృందంబున కిమ్మహోత్సవమునన్ జానొప్పఁగా నేర్పరిం
 చినచో రెండవ పఙ్క్తినుండి తగ వీక్షించెన్ గడున్ వేడ్కతోన్.
సీ. పరదిన మందట జరిగిన దర్బారో
 త్సవమున నల్ల రాజప్రతినిధి
కన్నాటు ప్రభువుల కిన్నరాధీశ్వరుఁ
 బరిచితుఁ గావించెఁ బరగఁ జెన్న
రాజధానికి గవర్నరయి యొప్పెడునాట్టు
 హిల్ప్రభు, వందులో నిమ్మహీశు
లండనులోఁ జూచి యుండుటఁ గన్నాటు
 ప్రభువాక కొంత సంభాషణమ్ము
తే. నడపి యుండెను, బిరుద సంధారణోత్స
 వమ్మున కొకింత దేహ మస్వస్థమగుట
 నరుగఁజాలక మిగిలిన యమ్మహోత్స
 వమ్ము లన్నిఁటికిని నేగెఁ బ్రభువరుండు. 352
గీ. ఇమ్మహారాజు డిల్లీపురమ్ము విడిచి

శ్రీజగన్నాథమున స్వామిసేవ కొక్క-
దినము వసియించి పైనమై జనవరినెలఁ
బదునొకండవతేదిని స్వపురిఁ జేరె. 353

చ. ప్రతినిధులొచు లండనుపురమ్మున కేఁగినవారలెల్లనం
చితగతి సార్వభౌము నభిషేకమహమ్మును గూర్చి చాలఁ బ్ర
స్తుతియొనరించుచుఁ దమ విశుద్ధమనోగతభక్తియెల్ల సూ
చితముగ నొక్క- విన్నపము సీమకుఁ బంపిరి చక్రవర్తికిన్. 354

సీ. ఇండియాదేశమందుండెడి వెవ్వేరు
రాష్ట్రంబులయును బురమ్ములయును
బ్రతినిధుల్ శ్రీసార్వభౌము కిరీట సం
ధారణోత్సవపు సందర్భమునను
హర్షసూచకముగ నంపిన పత్రిక
వచ్చెనటంచును, వచ్చినట్లు
వ్రాయుమంచును, జక్రవర్తి యాజ్ఞనొసంగె
ననియును, వ్రాయ నాకాజ్ఞయయ్యె

తే. మీకు మీ ప్రాతినిధ్యము మెరయు రాష్ట్ర
జనులకును గల భక్తికి సంతసమున
నిండియా దొరతనము వారిడిరి హృదయ
పూర్వకములగు వందనములను బ్రీతి. 355

గీ. హైందవప్రతి నిధులంపి నట్టిమనవి
కిండియామంత్రి యాఫీసునుండి పిబ్ర
వరి యిరువదవతేదిని వ్రాసిపంపె
నుపసచివుఁ డీవిధమునఁ బ్రత్యుత్తరంబు. 356

గీ. పదియుఁ దొమ్మిదివందలపయిని రెండ
వదియయిన యేఁటయూరపునందుసంచ
రించుటయు, ఢిల్లియుత్సవ, మంచితదిన
చర్యపుస్తకమున వ్రాసె జనవిభుండు. 357

క. అలదిన చర్యాగ్రంథం
బిలరే డీ రాజధాని కేలికయగునామ్
టిలుప్రభువున కంకితముగ
నలరించి ప్రమోదమొసఁగ నది ప్రకటించెన్. 358

మ. అకలంక ప్రతిభావిశేషమహితుం డై యొప్పి బీయే పరీ
క్షకు నై యేగి తెలుంగునన్ బ్రథమకక్ష్యన్ గొన్నవిద్యార్థికిన్
బ్రకటప్రక్రియ స్వర్ణపుం బతకమున్ బ్రత్యేక మీయంగ స
ర్వకళాశాలకు రెండువేలొసఁగె రూప్యంబుల్ విభుం డాదృతిన్.

సీ. ధరణినాథుండు గోదావరీమండలం
బునఁ నొప్పఁగను దొంతమూరురాయ
వరములన్ బేరులఁ బరగిన గ్రామము
లయిదులక్షల మీఁద నర్థలక్ష
మును క్రయమిచ్చి తాఁ గొనియె, నారెము పూడి
యనునట్టియెస్టేటు నందుఁ గొదువ
భాగముఁగొనియె నల్వదినహస్రంబుల
ధనముఁ గ్రయమ్ముగఁ దగనొసంగి

తే. ఇంకనయ్యాయిచోటుల నెసగుకొన్ని
చిల్లరయినాములను జనవల్లభుండు
ఆరువేలధనమ్ముక్రయమ్ముగాఁగ
నప్పుడప్పు డొసంగి తా నవియుఁ గొనియె. 360

ఉ. ధారుణినాథశేఖరుఁడు దా మదరాసున నున్నయప్డు మై
సూరు మహీమహేంద్రుఁడును సూరిజనస్తుతుఁ డై నకొచ్చి ధా
త్రీరమణుండు నచ్చట యదృచ్ఛ వసించుచు నుండ నమ్మహో
దారులఁగాంచె వారుఁ బ్రతిదర్శన మిచ్చిరి గారవమ్మునన్. 361

1904

చ. పలుమరుఁ జెన్నపట్టణపుఁ బార్థివసంఘమువారు ప్రార్థనల్
సలుపఁగ సార్వభౌముల ప్రసాదముచే నవి భాజ్యరాజ్యముల్

దెలిపెడునట్టి బిల్లు కడుఁ దృష్టి యొసంగఁగవచ్చెఁ జట్టమై
బలుదయ నామ్‌తిహిల్ ప్రభువు పాయని యత్నము నాచరించుటన్.

గీ. పదియుఁ దొమ్మిదివందలపయిని నాలు
గవశకాబ్దంబు జనవరియందుఁ బదియుఁ
దొమ్మిదవ దివసమ్మున నిమ్మగు నవి
భాజ్యరాజ్యపుఁ జట్టమ్ము పరగవచ్చె. 363

గీ. నూటయిరువదినాలుగు మేటిరాజ్య
ములను గాపాడ నాంప్తిహిల్ ప్రభువు సమగ్ర
యత్న మొనరించుటను జేసి యన్న రేంద్రు
లెంతయుఁ గృతజ్ఞులయి యుందు రివ్విభునెడ. 364

చ. అల యవిభాజ్యరాజ్యముల యాక్టు కృతార్థత నొందునంత భూ
తలపతి శాసనమ్ముల విధానము సల్పెడు నమ్మహాసభన్
గల పని మానె నిట్టి యుపకారక శాసన మేర్పరించుటన్
దలఁపులయందు నాటిన కృతజ్ఞత వ్యక్తముచేయు కోరికన్. 365

చ. ఘనుఁడగు నాంప్తిహిల్ ప్రభువు జ్ఞాపకమై యొసఁగంగ నేదియో
ఘనమగు కార్యమున్ సలుపఁగా నవనీశులు సొమ్ముఁగూర్చి రీ
జనపతి యైదువేలొసఁగె సమ్మతి, నార్బతునాటు బ్యాంకిలో
నునిచిరి కూడినట్టిధన, మొక్క మొగిం జెడిపోయె నంతయున్. 366

గీ. చానలకు వైద్యమును సల్పు శాల కొక స
హస్రపరిమితమగు ధనమాంప్తిహిల్ ప్ర
భూత్త మునిపత్ని పేరితో నొసఁగె, ని న్న
రవరు సతియగు శ్రీమహారాణి యపుడు. 367

సీ. సద్గతిఁగన్న శ్రీచక్రవర్తిని వజ్ర
పుంజాబిలిని స్థిరముగను జ్ఞాప
కమ్ముచేయుటకయి కట్టించెను విశాఖ
పట్టణమ్మున సభాభవన మిమ్మ
హీనాధవర్యుఁ డద్దాని ప్రవేశోత్స

వము నడిపించె గవర్నరునకు
బదులుగ మండలపాలకుఁ డయినట్టి
క్యాంపు బెల్ నామకఘనుఁడు మార్చి
తే. యందు, నయ్యుత్సవమునకు ముందుగా గ
వర్న రంపిన యొక తంతివార్తఁ జదివె
నల విశాఖపురీ జను లవనిపతికి
వందనమ్ము లొసంగి రానందవశత. 368
సీ. శ్రీమద్విజయనగరీ మహారాజ కు
మారికామణి కడు గారవమునఁ
గోరుటచేత నీ ధారుణీపతి విజ
యనగరమున కేగి యచటి భూమి
వరు నభిషేకోత్సవముఁ గాంచివచ్చె, నా
నంద దంతీంద్ర భూనాధవరుని
కాలమం దీ నరపాలు రిద్వురుఁ జెన్న
పురమందు నన్యోన్యమును దరుచుగఁ
తే. గలియుచున్నను విజయనగరములోన
నీయుభయవంశములవార లిట్టు లుత్స
వంపు సమయమ్ములను బరస్పరము గలిసి
కొనుట కియ్యది ప్రథమమ్మె గురుతుకెక్కె. 369
క. జనపతి విశాఖమండల
మునఁదగు కృషి సంఘమునకుఁ బ్రోత్సాహ మొసం
గెను వేయిరూప్యములు దా
నిని నడపెడువారి కొసఁగి నిపుణత మెరయన్. 370
సీ. ఈ వత్సరాంతమం దిమ్మహారాజ వ
ర్యుఁడు కలకత్తా పురోత్తమమున
కరిగి రాష్ట్రప్రతినిధులగు నాంప్తిహిల్ ప్రభుఁ
గరజన్ ప్రభూత్తము గౌరవమునఁ

గనుఁగొనె నట దొరతనపు గృహమ్మున
నైన లెవీకి నాహ్వానమునను
జనయె, ఫ్రేజరునాఁగఁ దనరెడు లెప్టినెం
టు గవర్నరును గనెఁ దగిన భంగి
తే. నింక రాష్ట్రప్రతినిధి సభ నెసఁగు కార్య
నిర్వహణ సభ్యులను గాంచె నెమ్మితోడ
మఱియు సెక్రెటెరీల నందఱినిఁ జూచి
పరిచితుండయి వచ్చెను మరలఁ బురికి. 371
సీ. ఈవత్సరమ్మున శ్రీవేణుగోపాల
వల్లభ మనుపుష్పవనమునందు
నిరువదినాల్గు శ్రీ హరినామములకును
సమ సంఖ్య నొప్పు గంబములు గలిగి
యనురూప వైశాల్య మౌన్నత్యమును గల్గి
దృఢ రచనా పరిష్కృతము నగుచుఁ
దనరు మండపమును జనపతి కట్టించి
శ్రీ వేణుగోపాల దేవునకు స
తే. మర్పితము చేసె డోలావిహారమాది
యైన యుత్సవములకుఁ బ్రత్యబ్దమటకు
స్వామి విచ్చేయగా బౌర జను లనేకు
లచటి కేతెంచి సేవింతు రప్పుడపుడు. 372
సీ. అల పుష్పవనములోపల నరనాథుండు
మలచిన శిలలతో మంచి పనిత
రంబున నొప్పు చిత్రమగు హర్మ్యంబును
గడు దృఢంబగు దానిఁ గట్టఁజేసి
యవరోధ జనని వాసార్హ సమున్నత
ప్రాకార ముఖములౌ పరికరముల
నుచితవైఖరి దాని కొనరఁగాఁజేసి పు

ష్పకము వై ఖరి నది పరగుచుంట
తే. బుష్పక మహ లటంచును బొసఁగు నామ
ముని, చెమార్ప్వన కవరోధయుతముగాఁగ
నప్పుడప్పుడు భూవరుం డచటికరిగి
కొలది దినములు వసియించు నెలమి చెలఁగ. 373

1905

గీ. పదియుఁ దొమ్మిదివందలపయిని నైద
వదియయిన వత్సరమున నీ యవనిపతికి
నాం ప్టిహిల్ ప్రభునకుఁ జెందినట్టి రెండు
విషయములు ముఖ్యములగుచు వెలయుచుండె. 374
సీ. ఈమండలము నాం ప్టిహిల్ ప్రభుం డవలోక
నమ్ము చేసెడి సమయమ్మునందుఁ
నలవిశాఖపురమ్మునందలి పౌరశు
ద్ధ్య విచార సభవార లాప్రభునకు
మన్ననపత్రి మి మ్మానవేందుౖనిచేతఁ
గట్టింపఁబడినట్టి ఘనతరమగు
డై మండు జూబిలీ టౌనుహాలునసమ
ర్పణఁ జేయఁగోరిరి భక్తిభరితు
తే. లగుచు, దానినిగై కొన నా సభామ
హాభవనమున కేతెంచి యాపౖభూత్త
ముండు తద్దత్తపత్రము నిండు దయ యె
సంగఁ గొని యానతిచ్చె నీ చందమునను. 375
చ. పొలుపుగ నాకు మిత్రమయి పొల్చిన బొబ్బిలి నేలు ధారుణీ
తలపతి యత్యుదారతకతంబున మీకు నొసంగినట్టి ని
స్తులమగు నీ మహాగృహముఁ జూడఁగఁ గల్గుటఁజేసి యెంతయుఁ
గలిగెను నాకు సంతసము నాగరికోత్తములార యీయెడన్. 376
గీ. ఇట్టి దివ్య మహాసభాగృహము నిష్ప

రో త్తమంబున నిర్మించి యొసఁగినట్టి
ధారుణీనాథుదెసను గృతజ్ఞులగుచు
నుండు టెల్లవిధంబుల నొప్పు మీకు. 377

ఉ. ఏను గతాబ్దమందు మదినెంచిన భంగిని యీ భవత్పురీ
గానఁగరామిచేత నరనాథు దయారస పూర్ణమైన యా
హ్వానము నొంది యుండియును బాగుగ నీభవనప్రవేశముఁ
బూనిక నిర్వహింపమికిఁ బొందితి నెంతయు వంత యిత్తరిన్. 378

గీ. అయిన మీ మండలమునకు నధిపతియగు
క్యాంపు బెలు నాకుఁ బ్రతినిధిగాఁగఁ గొన్ని
వాక్యములు చెప్పియుండె, నవ్వాక్యములనె
నుడివెదను నేను ముదమెదఁ గడలుకొనఁగ. 379

శా. ఖ్యాతింజెందిన యీ మహాశయునిదౌ నౌదార్యసంపత్తియుఁ
బ్రీతిఁ మెచ్చుకొనంగఁ జాలు సుగుణశ్రీయుక్తి నాతండు దా
జేతః ప్రీతిదలిర్పఁగా నిట వచించెఁ దాని లాభంబె మీ
కే తాదృక్స్వరసౌధరూపమయి యెంతే మోదముఁ గూర్చెడున్.

చ. అల మదరాసు పట్టణమునందును దక్కఁగ రాజధానిలో
పల మరి యెందునేని నిటువంటి మహోన్నతముఁ బ్రశస్త శి
ల్పలలితమౌగృహంబు కనుపట్టదు దీనిని జూడ సంతసం
బలమెను నిట్టి సుందరగృహమ్మునకేఁ బ్రథమప్రవేశముఁ
సలిపిన గౌరవమ్ముఁ గొనఁజాలమికెంతయు వంతనొందితిన్. 381

ఉ. ఐనను మీకతెక్కరగు నాతనికంటెను దనమహోత్సవం
బేను బ్రశస్తరీతి నెనయింతునె? యాతఁడు తనమహోత్సవం
బౌనెడ నాడినట్టి నుడులన్నియు సత్యములై కనంబడఁ
వానినె యిప్పు డొక్కపరి పల్కుట యుక్తముగాఁగ దోఁచెడున్. 382

గీ. చెన్నపురమునఁ దరుచుగ నిన్న రేంద్రుఁ
గనెడు భాగ్యవిశేషంబు గలుగునాకు
లోకహిత కార్యములకె యాలోచనంబు

సలుపు నెప్పుడు గన్న నీ జనవిభుండు. 383

చ. జనపతి యొక్క గ్రంథమును జక్కఁగఁ గ్రొత్తగ వ్రాసె, ముద్రణం
బునకును మున్ను దాని ననుమోదముతోఁ జదువంగఁ గంటిఁ దా
ననుభవలబ్ధమై ప్రకృత మాచరణంబున కర్హమైన నీ
తిని ప్రభు పుత్రకోటి కుపదేశముచేయఁగఁ, బూనె దానిచే. 384

క. అని యిట్లు విశాఖపుర
మ్మున నొప్పు సభాగృహమున మ్యూనిసిపల్ మ
న్ననపత్రమునకు నుత్తర
ము నొసంగుచు నాం ప్తిహిల్ ప్రభువు దా నుడివెన్. 385

సీ. భరతఖండంబునఁ బరగెడు ప్రభుకోటి
సూనుల కుపయుక్త మైనరీతి
నిరువదినాలుగు వరవిషయంబుల
పయి నుపన్యాసముల్ వ్రాసి 'యిండి
యా ప్రభు నీతి' యటన్న నామముతోడఁ
బ్రకటించె గ్రంథ మీ రాజవర్యుఁ
డాం ప్తిహిల్ ప్రభువున కంకిత మొనరింప
నెంచి దాని కనుజ్ఞ యిచ్చుటకయి

తే. ప్రకటనకు మున్ను పంపె నా ప్రభువరునకు
నాతఁ డామూల చూడ మానట్లు వాని
నన్నిఁటిని బఠియించి తా నిన్న రేంద్ర
చంద్రు పేరను వ్రాసె నీ చందమునను. 386

గీ. "నరవరోత్తమ ! మీ యుపన్యాసములను
జాల యభిరుచితోడను జదివినాఁడ
వాని నిప్పుడు నా యభివందనముల
తోఁడ మీతావునకుఁ బంపినాడఁ దిరుగ. 387
ఈపనిని గూర్చియే కాక యేతలంపుఁ
గలిగి యీపనికయి మీరు కడఁగియుంటి

రల తలంపునకునుగూడ స్వాంతపూర్వ
కాభినందనముల నిడె యంపినాడ. 388
ఆంగ్లవిద్యను మన మిప్పు డభ్యసింపఁ
జేయు నీ దక్షిణపు టిండియా యవనిప
తుల కుమారులు నిజరాజ్యములకుఁ బ్రభువు
లైన పిమ్మట వారలలోన నొకరి. 389
వలన ననుభవ లబ్ధమై వెలయు నిట్టి
యోగ్యమగు నీతికంటె నింకొకటి దెల్ప
వలయునది కల్గునే? యెంతవరకుఁగనిన
యావనంబున నొప్పారు నాంగ్లరాజ. 390
వరులు దరుచుగఁ దమతోటివారితోడఁ
గలిసి మెలసియు నుందు రక్కరణి గాక
యీ భరతఖండ రాజులు స్వీయరాజ్య
ములను నొంటరిగా నుంటవలన వారి. 391
కుండు నవకాశములు వీరి కొదవకుండు
టరయ నొకలోపమైయుండె, నట్టి కొరత
దీరె మీచేత నిప్పు డో ధారుణీశ
సులభమయి విన్నయంతనె తెలియునట్లు. 392
లేశమును సంశయమ్ములు లేనియట్లు
స్వానుభవ సిద్ధము ప్రశస్తమైననీతి
వెలువరింపఁగఁ బడియె మీవలన, ముందు
వృద్ధినొందంగఁ దగినట్టి నృపకుమార. 393
వరులకెంతయు నుపయోగకరము గాక
పోవదని తలఁచెదను నే భావమందు
వారిలో నొక్కరైన మీవలనఁ దెల్పఁ
బడుటయే కాక ప్రభువుగాఁ బరజనోప. 394
కారిగా నెంతయుఁ బ్రసిద్ధి గన్నమీరు

తెలుపుటను జేసి యీనీతి వెలయ వారి
హృదయముల నాటకను బోవ దెన్నిచూడ
నాంగ్లదేశీయు లగువారి యాశయముల. 395
కును విభిన్నంబుగా గ్రంథమున ననేక
విషయములు మీరు వ్రాయుట విపులమైన
యభిరుచి జనించె దానిపై నధిప నాకు
హైందవప్రభుచేతను హైందవప్ర. 396
భులకు నై వ్రాయఁబడు గ్రంథమునను నాదు
పేరుఁగలుపుట ప్రత్యేక గౌరవయుత
మైన శ్లాఘ యటంచు నే నాత్మఁదలఁతు
నైనఁ గేవల హిందువు లయినవారి 397
యాశయమ్ములతోఁడనె యధిప మీరు
నిండుకొని యుండఁగాలేదు నిశ్చయముగ
భవ దుపన్యాసములు స్వానుభవమువలని
ఫలములయి వానివలస సంప్రాప్తములగు. 398
భావముల నిండియుండుటం బట్టి చూడ
భరతఖండస్థులగు గొప్పవార లెట్టు
లాంగిలేయుల భావమ్ము లనుసరింతు
రవ్విధంబును జూపుచు నలరుచుండె. 399
నట్టులయ్యు స్వదేశ్యంబు లైన వారి
యుడుపులను నైజగుణముల విడువ నవస
రమ్ము లేనట్టు లెంతయుఁ గ్రాలుచుండు. 400
కడు దయారసమొప్ప నీ గ్రంథమును మ
దంకితము సేత కెంతయు హర్షపూర్వ
కముగ నంగీకరించితి ఘన వివేక. 401
ఇట్లు మీ ముఖ్య మిత్రమై యెసఁగునట్టి
యాంప్తిహిల్ ప్రభు హస్తాక్షరావళి "యని

వ్రాసె నిటు లా ప్రభువు రాజవర్యు పేర. 402
ఇట్టు లీగ్రంథమును బ్రకటించి హిందు
దేశమందును యూరపుదేశమందు
నున్న మిత్రుల కంపఁగ నొక్కభంగి
వారు వీరును మెచ్చిరి గారవమున. 403

సీ. పార్వతీపురమునఁ బ్రముఖులు స్థాపింపఁ
గడఁగిన జూబిలీ క్లబ్బునకును
జెన్నపురమ్మునఁ జెలువొందుచున్నట్టి
సర్వం సహానాథ సంఘమునకు
ధారుణీకంప నివారణార్థము మహా
జను లొనగూర్చెడి ధనమునకును
బ్రిన్సాఫువేల్సు నాఁ వెలయు సత్ప్రభువు నా
దరణమునకుఁ గూర్చు ధనమునకును

తే. గరజనుప్రభూత్తముని జ్ఞాపకమ్మునకగు
ధనమునకుఁగూడ నీ సువత్సరమునందు
నొక్కొక సహస్ర మితమగు రొక్కమిచ్చె
నిమ్మహారాజవర్యుండు సమ్మదమున. 404

1906

చ. అల మదరాసుఁ జూచుటకునై యువరాజు సతీసమేతుఁడై
పొలుపుగ వచ్చునప్పటికి భూపవరేణ్యుని రమ్మటంచుఁ దాఁ
బిలిచెను జెన్నరాజ్యమును బేర్మిని బ్రోచు ప్రభుత్వ, మిమ్మహీ
తలపతి సావరోధుఁడయి తా నరిగెఁ బ్రమదంబు మీరఁగన్. 405

క. జనవరి యిరువదినాల్గవ
దినమ్మునను జెన్నగరి తీరంబున నౌ
కనుడిగిరి రాజ దంపతు
లనవధికానందమున జనౌఘము చూడన్. 406

గీ. వారినిధి తీర భూమిని వారికొఱకుఁ

గాంచియున్నట్టి ఘను లొకొక్కరుగవారి
పరిచయము నందఁ జేయంగఁబడిరి, యట్టి
వారిలో నిమ్మహారాజవరుఁ డొకండు. 407

సీ. శరధితీరమునుండి దొరతనంపు గృహమ్ము
దనుకను మిగుల నుత్సవముతోడ
నా రాజదంపతు లరిగి పురప్రవే
శముచేసి రల శుభసమయమందు
వంశ పరంపరాప్రా ప్తంబుగా రాజ
బిరుదమ్ము గలయట్టి నరవరులయుఁ
దక్కను గల జమీందారులయును రథం
బులకన్న నీ రాజతిలకు రథము
తే. నడిచె ముందుగ, మఱియును నాడు ప్రభుగృ
హమున నొకరాచవిందయ్యె నప్పుడును బి
దపనునైన లెవీకిని ధారుణీశుఁ
డరిగెఁ బ్రభువుల యాహ్వాన మందియటకు. 408

ఉ. అమ్మరునాఁడు భూమివరు లందరకుం దగ వేరువేర నె
య్యమ్మున దర్శనంబొసఁగి యాపయిఁ జెన్నపురీ మహీశసం
ఘమ్మతి భక్తిపూర్వకము గాగ నొసంగిన మన్ననంపుఁ బ
త్రమ్ముఁ బరిగ్రహించె యువరాజ శిఖామణి నిండు ప్రీతితోన్. 409

క. ఆ రాజ దంపతులకై
యారాతిరి పలుతెరంగు లై యెసఁగు చమ
త్కారమ్ములు గల యుత్సవ
మారాచగృహమ్ము పొంత నయ్యెం బయలన్. 410

గీ. ఇన్న రేంద్రున కొసఁగెఁ బ్రత్యేక దర్శ
నమ్ము యువరాజు మరుచటినాడు, మఱియుఁ
గొందఱి కొసంగె నైనరా ధ్బృందమందుఁ
గలిగె నీతని కే యట్టి గౌరవంబు. 411

క. ఒక్కరి వెంబడినే మరి
యొక్కరిఁగాఁ బిలిచి మాట లొప్పఁగ నాడెఁ
మక్కువతో సమ్మహితుం
డక్కజమును హర్ష మంది రందఱు మిగులన్. 412

గీ. ఇట్లు ప్రత్యేకదర్శన మిచ్చి యిష్ట
భాషణమ్మున నల సార్వభౌమ తనయుఁ
డారించుటఁ జేసి యీ భూదయితుఁడుఁ
గనియెను కృతార్థతను జాల గౌరవమును. 413

చ. అల నిశయందుఁ జేయఁబడె నాదరణోత్సవ మందులోన భూ
తలపతి తోఁడ భాషణముఁ దా నొనరించుచుఁ జక్రవర్తి కో
డలు తన పెండ్లివేళ నొక డంబగు దంతపుఁ బేటి నిమ్మహీ
తలపతి పంపి యుండుటను దా స్మరియింపఁగఁ జేసె నర్మిలిన్. 414

సీ. అయ్యువరాజోత్తమాంగన స్త్రీలకై
దయచేసె నపు డొక దర్శనంపు
సభ, యందులకు శ్రీ విజయనగరీమహా
రాజకుమారికా రత్నమును, మ
హా రాజ పదయుతుం డైనట్టి గజపతి
రాయనిరాణి, శ్రీ రమ్య బొబ్బి
లీ మహారాణియు నీమువ్వ రీమండ
లమునుండి యేగి రీ రమణు లొక్క.

తే. మండలమ్మున నుండియు నొండొరులను
గలిసికొని యుండలే దిట్టి కాంతల కొక
చో సమావేశ మొనరించె నీ సభ, యిది
చాల గురుతింప నర్హ మీ చరితయందు. 415

గీ. అల గవర్నరు నాతని యంగనయును
హర్ష మిగు రొత్తఁగా నా దినాంతమందు
జరపి రా రాజ దంపతుల్ స్వాంతమందు

నుల్లసింపఁగ వనవిహారోత్సవంబు. 416
గీ. అంతట గవర్నరును నీ ధరాధిపతియు
నమ్మహామహు నతివయు నిమ్మహీశు
రాణియును నల్వురి పరస్పరమ్ము దర్శ
నమ్ము ప్రతిదర్శనమ్మును సమ్మదమున. 417
చ. అల యువరాజపత్నిఁ గనినట్టి మహోత్సవముఁ స్మరింపఁగా
జెలువల వైద్యశాల నృపశేఖరు మానిని యొక్కశయ్యఁ దా
వెలయఁగ నిల్పి యయ్యమకు వేడుక మైఁ దెలుపంగ నామెయుఁ
దలపునఁ గల్గు సంతసముఁ దప్పక వ్రాసె బహూకరించుచున్. 418
సీ. ఇమ్మహారాజేంద్రుఁ డిరువదియైదువ
త్సరము లీ రాజ్యము సురుచిరగతి
నేలె, నీ యబ్దంబు జూలయినెల పదు
నెనిమిదావ తేదితో నెనసె బూర్తి
నది, యందుచేత నీ యాగస్టునెల నైద
వదినమ్మునం దీ ధరాధినేత
దర్బారు మహాలులోఁ దగ నొక్కసభఁ దీర్చి
యా యయ వ్యయాది సమస్తవిషయ
తే. ములను దెలిపెడు పత్రిక ముఖ్యమంత్రి
చదివిన యనంతరమ్మునఁ జతురవచన
భాసురమ్మగు నొక యుపన్యాస మిచ్చె
హర్షవశులయి యందఱు నాలకింప. 419
గీ. “ఈ పురాతన సంస్థాన మిరువదేను
వత్సరమ్ములు పాలింపఁబడుట ననుస
రించి దర్బారు నిపుడు కావించితి నిది
చేయుటకుఁ గల యూహను జెప్పవలయు. 420
ఉ. ఏబదివత్సరంబు లిల యేలిన యూరపు రాజకోటికిఁ
జూబిలిపేరి యుత్సవము సొంపుగ జేయుదు రా ప్రదేశమం

దేబదియేండ్ల యేలుబడి యియ్యది కామిని నెన్నిచూచినన్
జూబిలికాదు కొందఱి మనోగతి నారసి యున్నరీతిగన్. 421

చ. తొలుతటివారికంటెఁ గడుఁ దోరపుఁగాలము నేలినాడనన్
దలఁపునఁ గూడ దీనికిఁ గడంగుటగా దల మా పితామహుం
డలఘుఁడు రాజ్య నిర్వహిత యయ్యెను ముప్పదిరెండువత్సరం
బులు మరి తద్గురుండు ధరఁ బ్రోచెను నిర్వది యెన్మిదబ్దముల్. 422

గీ. అందుఁ బ్రపితామహుని బాల్య మారువర్ష
ములు గలిసి యుండె, నటు నా ప్రభుత్వమునకు
బాల్యకాలముఁగూడ ముప్పదియు నారు
నగును గావున బాల్యంబు! దగదు గలుప. 423

చ. ఇరువదియైదువత్సరము లిట్లొనరించిన పాలనంబునన్
గర మభివృద్ధి యేపనులఁ గన్పడియుండెనొ, వృద్ధిచేయఁగా
నిరవు నొసంగఁజాలు నవి యేవిషయంబులొ, యెట్టి సత్క్రియల్
జరపుట కింక వీలగునొ, చక్కఁగ నిట్లు పరీక్ష చేయగన్. 424

గీ. మఱియు నిక్కాల మెవ్వ రేమార్గమునను
నెంతకాలము సేవించి రెఱిఁగి యట్టి
వారలకుఁ దగురీతి సత్కారములను
జేయుటకు నిట్లు దర్బారు చేయఁబడియె. 425

తృప్తి

చ. ఇరువదియైదు వత్సరము లేగతి నీ మన రాజ్యకార్యముల్
జరిగెనొ దాని మీ రిపుడు చక్కఁగ వింటిరిగాదె? మీ మదిన్
గరమును దృప్తి చెందినటు కన్పడుచున్నది, కాని యిందులో
నరయఁగ స్తుత్యమైన పను లంతగ లేవనియుం దలంచెదన్. 426

చ. ప్రతి జన భర్తకున్ దనదు రాజ్యము నంగములున్ స్వశక్తి నం
చితగతి రక్షితంబులుగఁ జేయుట యెంతయు ముఖ్యకార్య మ
ట్లెతఁడు తలంప కంతయును స్వార్థమె పూర్వులు కూర్చి రంచుఁ దా
మతిఁ దలపోసి రాజ్యమును మానుగఁ బ్రోవడయేని దాను సం

తతిని జనించువారలును దప్పక ముప్పును జెందకుందురే. 427

ఉ. చిక్కులలోనఁ జిక్కి యొరుఁ జేరును రాజ్యమునుర్వి దదంగముల్
వెక్కుతరాలనుండియును బ్రేముడిఁ గొల్చెడు నాశ్రితాళి వే
రొక్కని జేరు నట్లగుట నుర్వి స్వకృత్యము సల్పుచుంటలో
నెక్కువ లేదు చేయమిని నెంతయుఁ జెందును బ్రత్యవాయమున్.

గీ. మఱియు సంతతిలేకయె మా పితరులు
దత్తపుత్రునిఁగా నన్ను దారు కొనిరి
యౌరసులు లేని యట్టి ధరాధినేత
లొకని దత్తునిగాఁ గొంట యుక్తరీతి. 428



గాఁ బ్రవర్తించి యుత్తరకార్యములను
జేసి సద్గతి గలుగంగఁ జేయుటకును,
సంతతిని నిల్పుటకును, రాజ్యమును బ్రజల
బంధులను సాధ్య మగునంత బాగుమెరయ. 430
బ్రోచుచుంటకు, మఱియును మున్ను దాము
స్థాపనముచేసినట్టి సద్ధర్మములను
నడపుటకుఁ, దాము మును మొదలిడినమంచి
కార్యములఁ బూర్తియగునట్లుగా నొనర్పఁ. 431
గాను గద ? కాన నౌరసుకంటె నాకుఁ
గలదు బాధ్యత, యటువంటి కార్యజాల
మందుఁ జాలవరకుఁ జేసినపుడు తృప్తి
నొందవలెనని తలఁతునే నుల్లమందు. 432

క. ఒక్కటిరెండూళులలో
బ్రముక్కుడు లుండినను రాజ్యమునఁ గనుఁగొనఁగా
నిక్కువమగు బ్రభుభక్తికి
నిక్కలగుచు రైతులెల్ల నెసఁగుదు రిచటన్. 433

ఉద్యోగస్థులు.

సీ. ఉద్యోగి జనులలో నూహింప బ్రాహ్మణుల్

నేర్పు సమర్థత నెగడువార
లైనను వీరియం దార్జవమ్ముకొరంత,
జననాయకుం డెంత జాగరూకుఁ
డగుచు వారలఁ జూచు నంత బాగుగఁ బనుల్
చేయుచుందురు, విశ్వసించి విడువ
గాదు సేతురు, వెల్మవారిలోఁ బలువురు
న్యాయవర్తులు గల రైనవీరి
యందు సమర్థత యల్పంబు, పెరచోటఁ
బని చేయుఁ డనినచో భయపడుదురు
ఇపు డున్న యుద్యోగి బృందమ్ములో మంచి
చెడుగులు వేర్వేర చెప్పనేల
తమతమ వర్తనల్ తమహృదయంబులఁ
దార్కాణ యగుచును దగిలియుండఁ

తే. జన్న యుద్యోగిజనులలో విన్నకోట
శంకరామాత్యుఁ డొక్కఁ డా సరణిని జెలి
కాని గోపాలరాయఁ డొక్కఁడును బ్రభువు
లాభమునె చూచి కార్యముల్ నడపి రెలమి. 434

క. వారలపగిదినె యిప్పటి
వారును వర్తించి శుద్ధవర్తను లగుచున్
బేరు వడయుటకున్నై మన
మారఁగ యత్నంబుసేత యర్హము చూడన్. 435

బంధువులు.

ఉ. ఇచ్చటి కేను వచ్చినపు డిర్వురొ మువ్వురొ తక్క బంధులం
దచ్చపు రాజభక్తిమెయి నందరు నుండిరి, యట్టివారిలో
హెచ్చు జనంబు లిప్డు గతియించిరి యిప్పటి చిన్నవారిలో
నిచ్చఁ దలంచిచూడ నొక రిద్దరు తక్కఁగ నున్నవారిలో
నచ్చపు భక్తి పూర్వులక్రియన్ గన లేదని చెప్ప సిగ్గగున్. 436

వెలమవారు.

సీ. ఏనువచ్చినయప్పు డీ వెల్మవారిలో
నా యవ్యయాది కార్యంబులందు
నొక్కరు నుండలే దొకకొన్ని పనుల ని
యామకులై యుండి రపుడు గొంద
రట్టివారలకు నా యధికారకాలంబు
మొదలుగ నుద్యోగములు క్రమముగ
నొసఁగుచు విద్యయం దుత్సాహమును జాల
గలుగంగఁ జేసితిఁ బలుతెరఁగులఁ,
తే. ప్రభువు నాజ్ఞను మీరక భక్తి యుక్తి
మెలఁగుచు గతించె మున్ను రేమెళ్ల రామ
రాయఁ డొక్కఁడె యటువలె న్యాయమూని
నేటి వారలు క్రమవృద్ధి నెగడవలయు. 437

ఇతరసేవకులు.

తే. పూర్వులను బట్టిచూడ నిప్పు డిట నున్న
సేవకులయందుఁ గ్రమముగ క్షీణత గను
చున్నవి సమర్థతయు నేలుచున్న ప్రభుల
యెడల భక్తియు, వీరి కొక్కింత మంచి 438
పదవి గల్గినయెడల జీవనముచేయు
వృత్తిని గణింపకుందురు భృత్యపదవి
తొలఁగఁబెట్టిన నైనను దలపునందు
లెక్కసేయరు, సాల్టు పోలీసుమొదలు. 439
గలుగు శాఖలలోపల సులభగతిని
జీవనముగల్గునని యిట్లు చేయుచుందు
రొక్క ప్రభువును గొలిచియె యుక్తరీతి
నుండనేరని వాడు పెక్కండ్రు పై వి 440
చారకులు గల్గ నయ్యాయిశాఖలందుఁ

జేయవలెఁ గద యుక్తమా సేవ? మఱియుఁ
దప్పు చేయుటచేతను దండితుఁడగు
వాఁడు మరి యొక్కచోట జీవనముగోర. 441
నతఁడు పూర్వము కొలిచిన యధిపువలన
వాని దోషస్వభావము వ్యక్తపరుచు
కొన్నక యే యెవ్విధమున జీవనము గలుగఁ
జేయుచున్నారొ? పయివారు, చిత్రమయ్యె. 442
పొరుగు రాజులు గూడ నీ వరుసగానె
జరపుచున్నారు కడు దురాచారమనక

ము ౧ం పు.

ఒక్కసంస్థానమునఁ బెక్కురుండవలయుఁ
గార్యకర్తలు, వారిలో నార్యమతులు. 443
స్వల్పసంఖ్యాకులే యుందు రైనఁ బ్రభువు
సాధ్యమగునంతవరకును జక్కచేసి
యందరకు మంచినడువడి యలవడునటు
చేసికొనవలె, మోహనతు చేసినపుడు. 444
బహుమతి యొసంగవలెఁ, దప్పు పని యొనర్చి
నపుడు తగురీతి శిక్షచేయంగవలయు,
నట్లె మిము సత్కరించియు నర్హశిక్ష
నందఁజేసియు నుంటినే నందు సంత 445
సమున సత్కారమును, విషాదమున శిక్ష
యును, బొనర్చితి నయ్యాయి పనులవలన
బహుమతుల నొందుదు మను విశ్వాసమునను
గొంద రీసభకును వచ్చియుందు రిపుడు 446
నా యుపన్యాసమందు నందఱిపయి నిటు
లోపములె పెక్కు లిపుడు నిరూపణమ్ము
చేయఁబడి యుంట నయ్యాస శిథిలగతిని

జెందియుండును, నే నిట్లు చెప్ప నెల్ల. 447
ముందు మీకును మీస్థానములను రాఁగ
లట్టివారలకు హితార్థ మంతెకాని
నున్న చుట్టుటకయి కాదు చూడు డిపుడు
ఎవని కరుణాకటాక్షమే నింతవరకు. 448
జాలయభివృద్ధితోఁడను బాలనమ్ము
చేయ నవలంబమయ్యెనో, చిరతరముగ
నెవఁడు మా కులదైవమై యెసఁగువాఁడొ
శ్రీమ దఖిలేశ్వరుండయి చెలఁగు నట్టి 449
వేణుగోపాలునకు నొక్కవేయి రూప్య
ములు సమర్పించితిని, యిట్లె పూజలొందు
దేవవరుఁడు సీతారామదేవునకును
వేయి రూప్యమ్ములను సమర్పించినాడ. 450
బహుమతుల దెల్పుటకుమున్న భక్తితోడ"
అనుచు గంభీర మగు నుపన్యాస మొసఁగి
ప్రస్తుతోద్యోగులకె కాక బహుదినముల
నుండి కొలుచుచుఁ బనులయం దుపకరించి 451
నట్టి పలు రకముల వారి కవనినాథుఁ
డిరువదేనేండ్లు రాజ్యంబు నేలి యుంట
వత్సరమ్మున కొకవేయి వరుస నిరువ
దేనువేల ధనంబుఁ దా నిచ్చె నపుడు. 452
గొప్ప యుద్యోగులును మరి కొద్దివార
లనెడు భేదంబు లేకుండ నవని విభుఁడు
కొలువులో నున్నయట్టివారలకు నెల్లఁ
దత్తదర్హంబుగాగను ధనము నొసఁగె. 453
రాష్ట్రమున సాగుబడి చేయు రైతులు గత
వత్సరమ్ములఁ జెల్లింప వలనుగాక

ఋణము పడియున్న ధనమును గృపదలిర్ప
రాజవర్యుండు బహుసహస్రములు విడిచె. 454

సీ. ఈ యుత్సవమ్మును నెల్లరు నెప్పుడు
స్మరియించునట్లు సంస్థానమందు
నున్నట్టి తగువార లొక్కచో సభదీర్చి
రంగులతోఁడఁ జిత్రమయి పూరు
షప్రమాణముగ బ్రశస్తవైఖరిదాల్ప
శ్రీమహారాజేంద్రు చిత్రపటము
చందాల వలనను సమకూర్చిన ధనంబు
చేతను నిర్మింపఁజేసి పిదప

తే. నల్ల విక్టోరియా టౌనుహాలునందు
దాని నుంచుటకొరకుఁ దీర్మానములను
జేసికొని దాని కనువగు చేతలకును
బ్రముఖులందఱుఁ గడఁగిరి భక్తితోఁడ. 455

సీ. ఈవత్సరమునందె శ్రీ వేణుగోపాలు
నాలయమ్మునకుఁ బ్రాగ్ద్వారముగను
నత్యున్నతంబయి యసమాన దార్ఢ్య శి
ల్ప కలావిశేష విభాసితమయి
పంచ భూమికలచే సంచిత మయినట్టి
గోపుర రాజమ్ము భూపవరుఁడు
నిర్మింపఁజేసి వినిర్మలభక్తితోఁ
దత్ప్రతిష్ఠా మహోత్సవము నడపె

తే. జనవరేణ్యుని దగు యశస్తంభమనగ
నది యొసంగును దానితో నాలయమున
కవసరము లైనయట్టి సర్వాంగములును
బూర్తియగుచు నెసంగెను బొలుపు మిగుల. 456

1907

గీ. వత్సరమ్మున కొక చోట వరుసమీఱ
జరగుచుండు పశుప్రదర్శనము జరిగెఁ
బదియుఁ దొమ్మిదినూరులపయిని నేడ
వదియయిన యబ్దమున నిప్పురాంతికమున. 457

గీ. అల ప్రదర్శన మెంతయు నధిక వైభ
వమ్ముతోఁడను దొల్లిఁటివాని మించి
యెసఁగె, నీ భూతలేశ్వరుం డెల్లగతుల
సాయ మొనరించుటను జేసి శ్లాఘ్యమగుచు. 458

సీ. పదియు నెన్మిదినూర్లపయి నెనుబదిరెండ
వది యగు క్రైస్తవ హాయనమునఁ
దనచేత సంస్థాపితంబైన హైస్కూలు
దినదిన మభివృద్ధిఁ గనినకతన
తదుపయోగార్థమై తగినప్రదేశమ్ము
పురసమీపమునందె యరసి యచట
వైశాల్యమును శుద్ధవాయు ప్రసారమ్ము
నున్నతియునుగల యొక్క భవన

తే. రాజమును గట్టి నృపతి యా రమ్యగృహముఁ
దెరువ జిల్లా కలెక్టరై పరగు క్యాంబె
లను ఘనుని గోర నాతఁ డప్పని యొనర్చి
నపుడు గంభీరమగు నుపన్యాసమిచ్చె. 459

గీ. ఇమ్మహారాజవర్యుండు సమ్మతిమెయిఁ
జనుల యుపయోగమునకయి సలిపినట్టి
గొప్పకార్యము లన్నియుఁ గొఱఁతవడక
యుండునట్లొత్తి చెప్పె నయ్యుత్తముండు. 460

క. గోపాల బాగు పజ్జనె
దీపించు గృహోత్తమంబు ధృతిమైఁ గొనియెఁ

భూపాలుఁడు మదరాసు మ
హాపురమునఁ దగిన క్రయము నర్థి నొసఁగుచున్. 461

సీ. భూవరేంద్రుండు లక్ష్మీవిలాసంబను
హర్మ్యమునందలి యాత్మవాస
మును మార్చి నూతనముగ నిర్మితంబును
నసమాన రచనా సమన్వితంబు
నతి విశాలంబును నఖిలర్తు సుఖదంబు
లలిత శ్రీ కృష్ణవిలాస నామ
కలితంబు నగు సౌధ తిలకంబునఁ బ్రవేశ
మును జాంద్రవత్సరాదిని నొనర్చి
తే. మును వసించిన యల సౌధమును ద్వితీయ
తనయుఁడగు రామకృష్ణరంగ నరభర్త
కును నివాసముగా నొసంగిన నతండు
మెలఁగుచున్నాఁడు సుఖవృత్తి వెలయ నందు. 462

ఉ. భూరమణుండు రెండవసుపుత్రుని దా వెనువెంటఁ గొంచుఁగూ
నూరున నెండకాలమున నొప్పుగఁ గొన్నిదినంబులుండి మై
సూరును బెంగుళూరు పురిఁ జూచుటకై యటనుండి యేగి మై
సూరు నరేంద్రు విందగుచు సొంపుగఁ గాంచెను దత్పురంబులన్.

గీ. పార్థివవరుండు శ్రీరంగపట్టణంబు
గనుఁగొనెడు వేడ్క నొకనాడు చని యలపుర
మున గల విశేషములను సమ్మోదమలరఁ
గనియె నల్ల ప్రయాణంపు దినములందు. 464

క. మనుజేంద్రుఁడు చెన్నపురం
బున భూనాయకుల సంఘమునకుఁ దగనొసం
గెను రెండు సహస్రంబుల
ధనము విరాళంబుగా నుదారత యెసఁగన్. 465

సీ. అవనినాథుండు బాల్యంబునుఁడియు శ్రీ మ

హాభారతంబు రామాయణంబుఁ
బలుమరు వినియును బఠియించియును నందుఁ
గల నీతులను సనంగతముల మది
నుంచి వానిని విమర్శించి వ్రాయంగ ను
త్సాహంబు మదిలోనఁ దగిలియుండి
ప్రకటించె 'శ్రీ మహాభారత రామాయ
ణ విమర్శ'మనెడు గ్రంథము రచించి
తే. దాని కవతారికను వ్రాసె మానిత విజ
యనగరాంగ్లకలాశాలయందు నాధి
పత్యమున నొప్పు పండితప్రవరుఁడైన
యట్టి రామానుజాచార్యుఁ డాదరమున. 466

1908.

సీ. పదియుఁ దొమ్మిది నూర్లపయిఁ దొంబదియు రెండ
వదియగు నబ్దంబునందు భూవ
రుండు చెంగల్పట్టు మండలమునఁ దిరు
వూరను నెస్టేటు నొనరఁ గొనియె
నత్యంత బంధువు లైనట్టి చెలికాని
వారిచేఁ, దత్క్రియ ప్రాప్తధనము
నార్బతునాటను హౌసులో వారుంచి
తద్వృద్ధిఁ గొనుచుండ దైవికముగ
తే. నదియుఁ జెడిపోవ వీరి ద్రవ్యంబు వోయె
నపుడు తిరువూరు వనపర్తి యవనిపతికి
విక్రయించి తల్లాభంబు వీరి కొసఁగెఁ
యుపకృతి యొనర్చె నీయేట నృపతి దయను. 467

గీ. అవనినాథుఁడు విషసర్పియనెడు వ్యాధి
వలన నేప్రిలునెలలోన బాధనొందె
నదియు నొకనెల పీడించి యాంగ్లవైద్యుల
వలన శాంతింప దేహము స్వస్థమయ్యె. 468

గీ. మనుజనాథుఁడు గంజము మండలమున
నలరు బిరిడి జమీందారి యర్థభాగ
మును క్రయమునకుఁ గొనియెను మూఁడులక్ష
లును బదియునేనువేలు నా ధనము నొసఁగి. 469

గీ. రెండులక్షలపయి భూవరుం డిరువది
యేడువేల ధనంబుఁ దానిచ్చి దొంత
మూరు జగ్గమపేటలన్ బేరులఁ దగు
నట్టి గోదావరీమండలాంతరస్థ. 470
ములగు నెస్టేట్లు, లక్షపై బొసఁగ నలువ
దారువేల సహస్రమ్ము లగుధనమ్ము
నొసఁగి తన్మండలంబున నొప్పుపెద్ద
సేరియను భూమియును బొలుపారఁ గొనియె. 471

గీ. పంచవింశతి వత్సర పాలనోత్స
వమున రైతులపయి దయవలన విడువఁ
దలఁచినట్టి ఋణమ్ములెక్కలను జూచి
ముప్పదేన్వేలు తొలఁగించె భూవరుండు. 472

సీ. చెన్నపురమ్మున నున్నట్టి గిండినాఁ
దనరుచోఁ గట్టంగఁ దలఁచినట్టి
రేసు స్టాండనఁ దనరిన దానికి దశ స
హస్రంబులును, మరియంగ్లగురువ
యిన మార్షు జ్ఞాపక ధనమునకయి రెండు
వేలరూప్యములును, బిచ్చికుక్క
కాటు నివారింపఁగాను గూనూరులోఁ
దనరు వైద్యాలయంబునకు నొక స

తే. హస్ర ధనమును సాలూరునందుఁ గుష్ఠ
రోగి శరణాలయమునకు రూపికా స
హస్రమును నివ్విధమున నీ యబ్దమందు

ధారుణీనాథుఁ డొసఁగె నుదారమతిని. 473
గీ. అనుఁగుఁ దమ్ములలో నొక్కయతని సుతుని
పరిణయంబును నొక్క సోదరు కుమారి
పెండిలియుఁ జూచుటకుఁగాను వేంకటగిరి
పురికి విచ్చేసె నీయేట భూవరుండు. 474
గీ. వాలతేరున నొక్క విశాలమగు ప్ర
దేశమును గొని యల్లప్రదేశమందు
రమ్యతరముగఁ గ్రొత్త హర్మ్యమ్ముఁగట్ట
మొదలు కావించె నీయేట భూపవరుఁడు. 475
క. భూరమణుఁడు శ్రీలక్ష్మీ
నారాయణపూజ సలుప నగరిని నిటపై
నేరుపరిచె విష్వక్సే
నారాధన బదులు పనుల యారంభములన్. 476
గీ. నగరులోపల దసరాదినమ్ములందు
బలులు వేయు నాచారంబుఁ బార్థివేంద్రుఁ
డనవసరమని నిశ్చయ మ్మలరఁ జేసి
వాని నీయేటినుండియు మానుపించె. 47

1909

సీ. పదియుఁ దొమ్మిదినూర్లపయిఁ దొమ్మిదవయేట
బిరుద ధారణ మను పేరి యుత్స
వము రాట్ప్రతినిధియై పరగు మింటొప్రభుం
డల కలకత్తా మహాపురమున
జరపెడువేళ కీ జనపతి యచటికి
నరిగె, నయ్యుత్సవం బధికవిభవ
మున నయ్యె, బిరుదమ్ములను బలువు రలంక
రింపగఁ బడిరి, యీపృథివిపతియు.
తే. నచటి రాట్ప్రతినిధి మొదలగు మహామ

హాలలను దర్శించి వారలవలన గౌర
వమ్ముఁ గని యట వాసి పురమ్మునకును
మగుడ విజయముచేసెను దగిన భంగి. 478

సీ. పంచవింశతి వర్ష పరిపాలనోత్సవ
జ్ఞాపకమ్ముగను సంస్థాన జనులు
రంగులతోఁడఁ బూర్ణంబగు ప్రభు రూప
పటమును బుర సభాభవనమందు
నునిచిరి మఱియును మును చెన్నరాజధా
నికి గవర్నరుగాఁగ నెగడినట్టి
యాంప్తిహిల్ ప్రభువరు నాకృతి పటమును
బ్రభువరుండుని చేఁ దద్భవనమందు
తే. నపుడు మండల పాలకుఁడైన క్యాంపు
బెలు ఘనుం డప్పటముల తెరలనుదీయు
నుత్సవంబును జరపె సముత్సుకులగు
పురజనుల కోర్కి సఫలతఁ బొందునట్లు. 479

ఉ. చెన్నపురంపు రాష్ట్రమునఁ జెల్వగు రాజకుమారకోటికిన్
సన్నుతమైన విద్యను బొసంగఁగ నేర్పఁగఁజాలునట్టి య
భ్యున్నత పాఠశాల యొకటుండుట ముఖ్యము గాన నట్టి దా
నిన్నెరవేర్పుడంచు నవనీపతి ప్రార్థన చేసెఁ జేసినన్. 480

క. జనపతి సుతులకుఁ గాలే
జినినిలుపఁగ యోచనలను జేసి తెలుపుడం
చును నిర్విభుఁ డాది మహా
జనుల గవర్నరు విధించె సంఘము గాఁగన్. 481

చ. అల సభవారు తద్విషయ మంతయు నారసి వారి భావమున్
దెలిపెడు నట్టి విన్నపము తీరుగఁ బంపిరి, కాని ధారుణీ
తలపతు లమ్మహాత్కృతికి ద్రవ్యము బాగుగ నీయకుంటయే
యల పని సాగకుండుటకు నాఱిమ కారణమై కనంబడెన్. 482

సీ. ఈవత్సరమ్మున భూవరు నగ్రకు
మారుఁడై నట్టి కుమార మనుజ
నాథుండు దేశాటనమ్ము చేయుటకయి
యనుమతిఁదాఁగొని యాప్తబంధుఁ
డైన భుజంగ రాయండనుచరుఁడుగా
మేనెల యం దిండియానువిడిచి
యింగ్లండు దేశానకేగి యచ్చట దర్శ
నీయంబులైన యనేక నగర
తే. రాజములఁగని యల్ల యూరపునఁ గొంత
వరకు సంచార మొనరించి మరలి నిజపు
రమ్మునకు నేగుదెంచె సురక్షితమ్ము
గాను సెప్టంబరను నెల కడ ముదమున. 483
గీ. బొబ్బిలిపురమ్ము విడిచి యీ భూవరుండు
నీలగిరులకు విచ్చేసి నెమ్మదిమెయి
నెండకాలమ్ము గడపి తా నేగుదెంచె
ధాత్రికిని వర్షములఁ జల్లఁదనము గదుర. 484
మ. జననాథాగ్రణి పార్వతీపురమునన్ జా నొప్ప నెడ్వర్డు హా
లన నొప్పారు గృహంబు నచ్చటి ఘనుల్ ప్రార్థింపఁ గట్టించి యి
చ్చిన నక్టోబరులోఁ బ్రవేశ మహమున్ జిత్తం బెలర్పంగఁ దీ
ర్చెను 'బార్సన్స'ను మండలాధిపతి వారిం బ్రీతులన్ జేయుచున్.485
గీ. అపుడు రాజప్రతినిధియై యలరుచున్న
యట్టి మింటో ప్రభూత్తముఁ డల్ల చెన్న
పురమునకు రాఁగ జనపతి యరిగి యమ్మ
హాత్ముఁగని వచ్చెఁ గ్రమ్మర నాత్మపురికి. 486
క. హిందూమతమనియెడు పే
రం దెలుగున నొక్క గ్రంథరాజము రచనన్
బొందుపరచి యీ వత్సర

మందు మహీనాథవర్యుఁ డది ప్రకటించెన్. 487

సీ. భరతఖండములోనఁ జిరకాలముననుండి
సలుపు దైవారాధనలును గాల
వశమున జనులవిశ్వాసంబు లోపలఁ
గలిగిన మార్పులవలన వాని
లోనఁ గల్గు నవస్థలును నాదిగాఁగలఁ
యంశముల్ దొలిభాగమందు, దేశ
మున నాచరణమునఁ బొలుచు వ్రతంబు లే
యేకాలమందు నేహేతువులను
వచ్చెనో యందు నావశ్యకమగునవి
యెవ్వియో యవ్విధ మేరుపరుపఁ
బడియెను రెండవ భాగమ్మునందు, దే
శమ్మున నున్న యాచారములను
బలుతెరంగులవానిఁ దెలిపి వానికిఁ దగ
నుపపత్తులును గడుయోచనమెయి
వివరింపఁబడియె మూడవభాగమున, వ్యావ
హారిక హిందూమతాంశములును
బారమార్థికమత భాగంబులును గృహ
స్థులకాచరింపఁగవలను గలుగు
విషయమ్ములును గర్మ వివరణమ్మును శివ
కేశవాభేద సంకేతములును
శ్రీరామకృష్ణావతారముఖ్యతయు జీ
వేశ్వరాభేద సహేతుక సువి
మర్శమ్ములోనగు మహితవిషయములు
నాల్గవభాగమ్మునను దెలుపఁగఁ
బడియె, నీక్రియ నాల్గు భాగమ్ములగుచుండె
నాగ్రంథ, మద్దాని కషతరణిక

తే. వ్రాసె విజయనగర మహాపాఠశాల
యందు నధ్యక్షుఁడును సంస్కృతాంగ్లవైకృ
తాది భాషాస్వతంత్రుండు నధికనిపుణుఁ
డైన రామానుజాచార్యుఁ డాదరమున. 488

గీ. వెంకటగిరి కుమార భూ విభుఁడు సపరి
వారుఁడై యిప్పురమునకు వచ్చియిచట
జరుగు దసరామహోత్సవం బరసి కొన్ని
దినములు ప్రియమ్ము మైనుండి చనియెఁ బురికి. 489

మ. మనదేశమ్మున నిప్పు డిప్డు జన సామాన్యంబునం దంకురిం
చు నృపద్రోహపుఁజింతఁ బోనడచి సంక్షోభంబు వారింప నిం
పెనయన్ రాజులు నిల్పి రొక్కసభఁ దా రింపీరి యల్ లీగు నా
మనుజేశుం డలదాని కెన్నఁబడియెన్ మానొప్ప నధ్యక్షుఁడై. 490

1910

చ. బిరుదు లలంకరించునెడఁ బ్రిబెవరిన్ మదరాసులోపలన్
జరగిన యుత్సవంబు నరనాథుఁడు దాఁ దిలకించి బొబ్బిలీ
పురి కరుదెంచి యల్పదినముల్ చన రాష్ట్రము నేలు శ్రీ గవ
ర్నరు ఘనుఁ డంపె జాబొకటి రాజవరేణ్యుని చెంత కయ్యెడన్.

చ. నరపతి దాని నాదరమునన్ దిలకించి మనంబులోన న
చ్చెరువును బొందె నెంతయును, "చెన్నపురిన్ దగు రాజ్యకార్యముల్
జరపు సభన్ స్వదేశ్యులకు సభ్య పదం బిది యాదిగాఁగ నే
ర్పరచెఁ బ్రభుత్వమయ్యది ధరారమణా! కయికొందువే తగన్." 492

చ. అనుచు లిఖింపఁగాఁ బడియె నం దది రాతిరి చేరవచ్చుటన్
ఘనమగు నమ్మహాపదవి గైకొనుటో మరి మానుటో యటం
చును నరభర్త లోఁదలఁచుచున్ గడపెన్ నిశ నిద్రలేక, యా
ఘనుఁడు దయాతి సూచకముగా నల జాబు లిఖించియుంటచే. 493

గీ. అమ్మహాపదవిని బొంద ననువుగాద
టంచు వ్రాయుట కడు సమర్యాదముగను

మొరటుగను నుండు ననుచును బుద్ధిఁ దలఁచి
యల గవర్నరు ఘనుని బ్రత్యక్షముగను. 494

చ. కనుగొని యమ్మహాపదవిఁ గైకొననౌ ప్రతిబంధముల్ తగన్
మనవి యొనర్చు టెంతయును మంచి దటంచును నిశ్చయించి 'ద
ర్శనమును జేసి సర్వమును సన్నిధి శీఘ్రమె విన్నవింతు' నం
చును బ్రతిలేఖ భూవరుఁడు చొప్పడఁగా లిఖియించె నంతటన్. 495

ఉ. అన్నరభర్త వేగమె ప్రయాణము దానయి సానుయాయియై
చెన్నపురీ లలామమును జేరిన యమ్మరునాఁడె తద్విభున్
మన్ననతోడఁ గాంచి యల మానిత సభ్య పదంబుఁగూర్చిచ
ర్చన్నడపింప భూవిభుని సంశయమంతయుఁ దీర్చెనాతఁడున్. 496

క. అల ప్రభుఁ డివ్విభు సంశయ
ముల నెల్లఁ దొలంగఁజేసి పురికొల్పఁగ భూ
తలనాథుం డుత్సాహ
మ్మలరఁగ నప్పదవిఁ గొందు ననుచుఁ దలంచెన్. 497

గీ. తనదు నారోగ్యమునుగూర్చి తగినవైద్యు
నాశయముగొనఁ గడువొంది యట్లొనర్చి
యల గవర్నరు సన్నిధి 'నప్పదంబుఁ
గొనుట కంగీకరించితి' నని వచించె. 498

సీ. పదపడి మఱియు రెండుదినమ్ములనుమీఁద
'రాజేంద్రుఁ గార్య నిర్వహణసభను
మెంబరుగా నియమింప నంగీకార
మును సార్వభౌముఁడు తనకుఁ దెలిపె'
నని గవర్నరు ప్రియమారఁగ వ్రాసిన
పత్రిక వచ్చె నీ ప్రభువరునకు
మరునాఁడె పయనమై పురి కరుదెంచి శ్రీ
రాణితోఁ జెన్నపురమ్ముచేరి
తే. పదియుఁ దొమ్మిది శతములపయిని దశమ
వత్సరమ్మున మార్చి యిర్వదియునాలు

గవదినమ్మున ఘనమైన యల్లసభ్య
పదవిఁ గార్యాసనము గొనెఁ బ్రభువరుండు. 499

గీ. ఆంప్తిహిల్‌ప్రభు సత్తముఁ డాదియైన
వారలంపఁగ లెక్కకు మీరునట్లు
వచ్చె, నభినందనపుఁ దంతివార్త లుత్త
రమ్ము లిప్పతి కార్యాసనమ్ము గొనఁగ. 500

చ. జనపతి కార్యనిర్వహణ సభ్యత తత్ప్రథమంబుగా స్వదే
శ్యనరవరేణ్యులందుఁ గొని యప్రతిమంబగు గౌరవమ్ము గాం
చినకతనన్ మహాజనులు చెన్నపురంబునఁ దోట యుత్సవం
బునను బహూకరించుటకు మోదముతోఁడను నిశ్చయింపఁగన్. 501

గీ. ఏప్రిలనియెడు నెలయందు నెనిమిదవది
నమ్ము కాఁబోవు నయ్యుత్సవమ్ము నిలిచి
పోయె నారవతేదిని భూవరు నను,
జుఁడగు వేంకటకృష్ణవిభుఁడు గతింప. 502

గీ. దొరతనమువారు మదరాసుపురమునుండి
నీలగిరి కేగుటకున్ను నృపతి నిజపు
రమున కేతెంచి శ్రీమహారాణి నచట
నిలిపి నెలతుద నరిగెను నీలగిరికి. 503

గీ. అంత మేనెల యేడవదగు దినమ్ము
నందు నెడ్వర్డు చక్రేశుఁ డస్తమించె
ననెడు వృత్తాంత మిండియాయందుఁ బిడుగు
పడిన చందంబుగా వినఁబడియె నపుడు. 504

సీ. లండనుపురిని వెలంగు రాజకుటుంబ
మునకు నాశ్వాసన పూర్ణములగు
వార్తల నిజరాజ భక్తిసూచకముగా
మను జేశుఁ డిండియామంత్రివరుని
ద్వారముగాఁబంపెఁ బదపడికీర్తిం శే

షండగు భారత మండలేంద్రు
జ్ఞాపకనిధికిని సప్తసహస్రముల్
పంచశతమ్ము ముప్పదియు మూఁడు
తే. రూప్యము లొసంగె నీభూవరుండు సభ్య
పదవి గైకొని శ్రీసార్వభౌము జీవి
తదినములలోనఁ గొన్న వేతనపు ద్రవ్య
మంతయును వినియోగించె నధిపుఁ డిట్లు. 505
గీ. సార్వభౌముఁడు మనుజేంద్రు సభ్యపదము
నందు నియమించె నను హుకు మైదవ నెల
యిరువదేనవనాఁడు రా నేసిరి పదు
నైదగు పిరంగు లపుడు మర్యాదకొరకు. 506
ఉ. నీలగిరిక్ జెలంగు మహనీయ గృహమ్మున రాణు లుండఁగా
వీలగు నేరుపాటులను వే రచియింపఁగఁ జేసి యిమ్మహీ
పాలుఁడు బొబ్బిలీపురికిఁ బైనము తానయి వచ్చి రాజ్యల
క్ష్మీలలనాసమేతముగఁ జేరెను నీలగిరీంద్రమున్ దగన్. 507
గీ. జనవరేణ్యుఁడు కించిదస్వస్థుఁ డగుటఁ
జెన్నసగరంబులోపలఁ గొన్ని నాళ్లు
బొబ్బిలిని గొన్నివాసరంబులును నుండి
నెమ్మది యొసంగఁ జనియెను నీలగిరికి. 508
గీ దొరతనము కొండ దిగి చెన్నపురము మరల
జేరునప్పుడు కోయముత్తూరులోనఁ
దనరు కృషిశాస్త్రపాఠశాలను గనుగొని
బొబ్బిలికి నరుదెంచెను భూపవరుఁడు. 509
ఉ. వచ్చి పురమ్మునన్ గొలదివాసరముల్ వసియించియుండఁగా
బొచ్చెము లేనిభక్తిఁ బురముఖ్యులు రాష్ట్రీయులున్ మనంబులన్
హెచ్చిన వేడ్కతో నృపతికిచ్చిరి చిత్రవినోద మొతఁ డ
త్యుచ్చపదస్థుఁ డౌటను బహూకృతిగాఁ బురపాఠశాలలోన్. 510

ఉ. ఇచ్చటినుండి చెన్నపురి కీనరనాథుఁడు చేరునంతలో
నచ్చట నొప్పుచుండిన మహాజనులందరుఁ గూడి యొక్కచో
నచ్చపుఁగూర్మితో వనవిహారవినోదము చిత్రరీతిగా
నిచ్చి యహూకరించిరి నరేంద్రుఁడు సభ్యపదంబు నొందుటన్. 511

1911

సీ. ఈరీతి నయ్యధికారంబు శక్తియు
నేరుపు దగఁ బదినెలలు నడపి
పదియుఁ దొమ్మిదినూర్ల పదునొకొండవయేటఁ
బ్రథమ మాసంబునఁ బదియు రెండ
వదినమ్మునందు నప్పదవిని గొన్నికా
రణములచేతను రాజవరుఁడు
విడిచితినని మనవిని దాను లిఖయించి
యనిపె, నప్పుడు దొరతనము దాని




నంగీకరించుచు, నవనీశు విపులాను
భవమును, బొగడొందు ప్రాజ్ఞతయును
గల సలహా లింకఁ గఱవగు నను విష
యముఁగూర్చి తమ విషాదమును నేడు
గ్రంథస్థమగునట్లుగాఁ జేయుచున్నార
మనియు, నుద్యోగపుదినములందు
తే. దొరతనమునకు నీ భూమివరుఁ డమూల్య
వైఖరిని రాజకార్య నిర్వహణ మమరఁ
జేయుటకు నయి మదిలోనఁ జెందె మెప్పు
దానిఁ బ్రకటించితిమి యివ్విధమున ననుచు. 512
గీ. అల్ల యబ్దంబు జనవరియందుఁ బదియు
నారవదినంబు ప్రకటితమైన ఫోర్టు
సెంటుజార్జి గెజిటులోనఁ జిత్తమలర
వ్రాసి ప్రకటించి రిటు ప్రభుత్వమ్మువారు. 513

గీ. ఇన్న కేంద్రుని పదమందుఁ జెన్ననగరి
నున్నత న్యాయసభలోన నొప్పుచున్న
న్యాయమూర్తి కృష్ణస్వామి యయ్యరనెడు
ఘనుని నియమించి రల దొరతనమువారు. 514

గీ. ఫిబ్రవరియను నెలను బృధ్వీతలేశుఁ
డలహాబాదునకును ద్వితీయసుతుఁగూడి
యేగి వస్తుప్రదర్శన గృహము నచట
నెలఁకుఁ గనుఁగొని క్రమ్మర నేగుదెంచె. 515

సీ. గతవత్సరమునం దగష్టుమాసమునుండి
యును దేహ మస్వస్థతను గనుటను
ఘనులగు వైద్యుల యనుమతిని గుమార
నృపవరుం డేప్రిలునెలను లండ
నున కేగి యచ్చట ననుకూలగతిఁ జికి
త్సను బొంది యారోగ్యదశను గాంచి
శ్రీరాజచక్రవర్తి యగుజార్జిప్రభు
మకుటధారణ మహామహము నచట

తే. హర్ష మెసఁగంగఁ గనుగొని యచటినుండి
కదలి జూలయిమాసంబు కడను నిజపు
రమ్మునకు నేగుదెంచె సురక్షితముగ
వారలుఁ గుటుంబమును హర్షభరమునొంద. 516

గీ. లండను పురమ్ములోన జూలయి యిరువది
రెండవదినమ్ము జరిగెఁ గిరీటధార,
ణోత్సవం బాదిన మిప్పురోత్తమమున
జరపఁబడియెను వేడుకల్ సకలగతుల. 517

గీ. సార్వభౌముల పటము లుత్సవముతోడ
గజరథముమీఁద నునిచి యక్కాలమందుఁ
బట్టణము చుట్టుఁ ద్రిప్పిరి పౌరజ్ఞాన

పదులు విద్యార్థులును జయధ్వనుల నింప 518

గీ. బాణసంచుల గమి మతాబాలు మఱియు
దివ్వటీలును దివ్యమౌ తేజమొసఁగఁ
బంచవిధవాద్యములు మ్రోయ నంచితముగ
జరిగె దేవోత్సవము నిశాసమయమందు. 519

చ. జనపతి కార్యనిర్వహణసభ్యత నొందుటఁ జేసి రాజశా
సనమునుబట్టి యల్లదివసంబులలోపలఁ దీసికొన్న వే
తన ధన మెద్దియేని నొక ధర్మ్యము లోకహితంబునై తన
ర్చిన పనికై వ్యయింపఁ దన చిత్తమునందుఁ దలంచి యుండుటన్.

క. పనులమెయి నీలగిరికి
జనెడు స్వదేశస్థు లయిన జనులట వసియిం
పను దగిన బసలు తత్పురి
మున లేకుంటయొక లోపముగ నుండుటయున్. 521

క. దూరతరమునకుఁ జని య
ప్పురి నుద్యోగవశమునను బోలుచు స్వదేశ్యుల్
నిరతమ్ముఁ గలిసికొనఁగాఁ
బురిమందిర మొకటి లేకపోవుటఁ గనుచున్. 522

క. తనవేతనంపు ధనమున
జనపతి యచ్చట స్వదేశ్య జనవసతిగృహం
బును సువిశాలము రమ్యం
బునుగాఁ గట్టింపఁజిత్తమునఁ దలపోసెన్. 523

ఉ. ఏప్రభుఁ డీ సురాజ్యమున కేలికయై యలరారుచుండఁగా
నీప్రభుఁ డొందె సభ్యపద మెంతయు గౌరవ మందె నట్టి లా
లీప్రభువర్యునామమును లెస్సఁగఁ దాల్చి యాగృహంబు సొం
పై ప్రకటత్వ మొందవలెనంచును భూవరుఁ డాత్మ నెంచుచున్.

గీ. పనులమెయి రాజవరుఁడు సెప్టెంబరునెల
యాది నీలగిరికి గన నరిగియచట

నిర్మితము చేయఁబోయెడి నిలయమునకు
నల గవర్నరు ఘనుఁ బునియాదుశిలను. 525

గీ. *వేయుమని ప్రార్థనము చేయ నా యనఘుఁడు
పదియునేనవ తేదిఁ దద్భవనమునకు
మోద మొప్పారఁగాఁ బుని యాదుశిలను
వేయుచును బల్కె సభ్యులు విన(గనిట్లు. 526

సీ. "తగవరులార యి త్తరి బొబ్బిలి నరేంద్రు
కోరిక జరుపుటకును దొలుతను
ఈ దినాంతమ్మున నిచ్చట మన మిట్లు
కలిసికొనుటకునుఁ గల ప్రయోజ
నమ్మునుగూర్చి యీ నరపతి పల్కిన
దానికి బదులుగ నేను గొన్ని
వాక్యముల్ పలుక నుపక్రమించుచు నున్న
వాఁడ నీ భూపతి పలికినట్లు
చెలువగు లాలి యిన్స్టిట్యూటు నాఁ దగు
పేర నిర్మింపఁగ భూరమణుఁడు
పూనిన భవనంబు పునియాదుశిలవేయు
నవసరం బిది యయి యలరుచుండె
నీ యుద్యమంబుఁ దా నెందుకై పూనెనో
యేగతి నిది నిర్వహింపఁ బడఁగ
వలయునో యదియు నిప్పతి సంగ్రహముగాఁగఁ
జెప్పెను నేఁ దలచిన విధమునఁ
గాలక్రమమున నింక ననేకులయిన యూ
రపియనుల్ మఱియు భారతజనులును
నిచటికిఁ జనుదేర నెనయునట్టియు నితః
పూర్వకాలమ్మునఁ బొందినదియు
నగునట్టి యసదుపాయమ్మున కిచ్చోట

గ్లబ్బుమాదిరియగు నిలయము లేమి
కారణమ్మయి యుండెఁ గోపురమ్ముగ నున్న
వారలు నతిథులౌవారు గలిసి
మెలసి యుండ విహారనిలయము మాదిరి
వాసగృహంబు గానలయు నిచట
వానిలోఁ జదువంగ లోననాడెడు బిలి
యరుడు మొదల్ గల యాటలకును
బయి నాడఁదగు టెనిస్ బాట్ మింట నాదియగు
నాటల కనుకూలమైన గదులు
నిమ్మగు చోట్లును నెసఁగంగవలె మరి
యతిథులకును వారియనుచరులకు
వర్ణానుగుణముగ వసియించుటకు భోజ
నాదులకును దగునట్టిరీతి
నది యుండవలె, నిట్టి యక్కఱ దీర్పఁగ
ధారాళమైన యౌదార్య మలర
నిమ్మహారాజేంద్రుఁ డిటు పూనుకొనియె, మీ
రందఱు నెఱిఁగిన చందమునను
జనపతి పలికినట్లును జెన్నపురి గవ
ర్నరు వారి కార్యనిర్వాహసభను
బ్రథమహైందవ సభ్య పదమును వహియించి
యుండె నయ్యున్నతోద్యోగమునకు
ననుబంధము గల కృత్యము లీతఁ డెటు నిర్వ
హించెనో యందుపై నిట మదీయ
మగు నభిప్రాయంబు వ్యక్తపర్చుటకిది
యనుకూల మగు సమయంబు గాదు
కాని తదుద్యోగకార్యములను దృప్తి
కరముగ నెరవేర్పఁగలుగున నెడు

నమ్మిక నాదు చిత్తమ్మున నుంటచే
తనె చక్రవర్తి యుత్తరువు కోఱకు
నీమహారాజుపే రేను బంపితినని
యును, నాదు నమ్మిక కనువగు విధ
మునని యుద్యోగమును నిర్వహించి సు
దీయ విశ్వాసమ్ము నృపవరుఁడు యధా
ర్థీకరించినాఁడని యుఁ, బ్రసంగమ్ము
చేతనే నిప్పుడు చెప్పుచుంటి
జనపతి సార్వభౌమునకును నిజదేశ
మునకును భక్తి పెంపెనయ సలిపి
నట్టి యుద్యోగంపు వ్యాపారములు గౌర
వానవహంబులగుచు నలరుచుంట
యేకాక వేతనాపేక్ష లేనివియు నై
యుండగవలెనని యూహచేసి
యకాలమునఁ జెందినట్టి వేతనమంత
యును జనులకు సుపయుక్తములగు
పనులకొఱకు సమర్పణచేయఁగాఁ బూనె
నల వేతనంబులో నధికధనము
శ్రీరాజచక్రవర్తియగు నెడ్వర్డు జ్ఞా
పక కార్యనిధికి నై పరగ నొసఁగి
త దవశేషం బగుధనము నంతనె కాక
దానికి మరి కొంతధనము గూడఁ
జేర్చి యీ లాలి యిన్స్టిట్యూటుకు విని
యోగింప మదిలోన నూహచేసె
నీ భవనమ్మున కెల్లవిధంబులఁ
గాఁదగు నభివృద్ధి గలుగనేను
గోరెద లోకోపకారియౌ నీగృహ

దాత యీప్సితము సిద్ధమగుఁగాఁత
మున్ను లండనుపురమునఁ బదియారువ
త్సరములనాఁడు నే ధారుణీశు
పరిచయమ్మును గంటిఁ బదపడి యది యైదు
వత్సరంబులు నర్ధవత్సరంబు
క్రిందటఁ దిరుగ నాకుం దటస్థంబయ్యెఁ
బరిచయంబయి స్నేహభావమునకుఁ
గ్రమవృద్ధిగనె, నది కావున నమ్మైత్రి
నెప్పుడు ముదమున మెప్పు దనర
స్మరియించుచుందు నీజనపతి నాకు స
హోద్యోగి యగుచును నుంటకాక
మిత్రుండు నయ్యె, నమ్మైత్రి, నిష్కపటంబు
స్థిరమును బ్రేమమ్ముచేతఁ బూర్ణ
మును నయి యుండె నీజనపతి యివ్విధం
బుననె ముందును గూడ మునుపు గదుర
వర్తించుననుచు విశ్వాసంబు గలదు నా
స్వాంతంబునందు నో సభ్యులార
మీస్థానమునను హిందూస్థాన జనుల ప
క్షమునందు మఱియు ముఖ్యమ్ముగాను
నీ నీలగిరివాసు లైన వారలపక్ష
మునఁగూడ నిమ్మహా ఘను నుదార
దానమ్మున కిదె వందనముల నర్పింతు
నిష్కపటంబగు నెమ్మితోఁడ
తే. నిమ్మహాభవనమునకు నెమ్మి నాదు
పేరు పొందికచేసి యీధారుణీశుఁ
డొనర నాయెడఁ జూపిన యున్నతమగు
సత్కృతికి వందనముచేసు జనవిభునకు." 527

డిల్లీదర్బారు.

గీ. అవనిపతి రెండవకుమారుఁడైన రామ
కృష్ణ విభుతోఁడఁ బయనమై యేగి డిల్లి
పురమునకుఁజేరఁ జనె ననుచరసమేతుఁ
డయి డిసంబరునెల నాలుగవదినమున. 528

సీ. చక్రవర్తియు నలచక్రవర్తినియును
డిల్లీపురమునకు నుల్లమలర
నరుగుదెంచిరి డిసంబరునెల యేడవ
తేది, నప్పుడు రాట్ప్రతినిధి దార
సహితుఁడై వారికి స్వాగతమిచ్చెను
రైలు స్టేషనుకడఁ జాలభక్తి
రాజధానీశుల రక్షిత సంస్థాన
పతులను బరిచయ పరిచె మరియుఁ

తే. బలుతెరఁగులైన సేనలు బలిసి నడిచె
రౌతులై యిరుఁగెలకుల రాట్ప్రతినిధి
యిండియా మంత్రియును రాఁగ మండలేంద్రు
డరుగుదెంచెను దుఁరగంబు నధివసించి. 529

గీ. వారివెంబడి నాలుగశ్వములు పూన్చి
నట్టిఘనమగు నొకరథం బధివసించి
సార్వభౌముని రాణి యుత్సాహమలరఁ
జనియె జనములు గడు సంతసమునఁ జూడ. 530

గీ. వారివెంటను దమతమ గౌరవముల
వరుసచొప్పున నొకరివెంబడి నొకరుగ
నాత్మసేనలు బరివార మనుసరింప
నడిచిరి స్వతంత్ర నరపతుల్ కడుముదమున. 531

గీ. ఏనుగులులేమి నుత్సవ మొంతవైభ
వమ్ముగలిగియు మున్ను పందొమ్మిది శత

ములపయిఁ దృతీయమగు నేటి యల పురప్ర
వేశపుఁ వేడుకను బోలి వెలయదయ్యె. 532

గీ. సకలభారతీయ సప్తమైద్వర్గు ప్ర
భుస్మరణ సు చిహ్నమును దెరచెను
మరుదినమ్మునందు మహనీయుఁడైన శ్రీ
జార్జిచక్రవర్తి సమ్మదమున. 533

సీ. అలనెల పదియు రెండవ తేది దర్బారు
జరిగెఁ, దచ్ఛుభదివసంబునందు
నుదయకాలంబున నొక శుభపత్రిక
నదయుఁడై పంపె రాజప్రతినిధి
యిమ్మహారాజున కమ్మండలాధీశుఁ
డై నజార్జిప్రభుఁ డాదరమున
జీ, సి, ఐ, యి, యటన్న వాసి యగు బిరుదమ్ము
దయచేసెనంచును దానిలోన

తే. వ్రాయఁబడియుండెఁ, దచ్ఛుభవార్తదెలియు
నంతలోననె భూపతి యాత్మపురికిఁ
దంతివార్తను బంపి మధ్యాహ్నవేళఁ
జనియె దర్బారు గనుగొన సంతసమున. 534

ఉ. భారతఖండమందుఁ గలభాగము లన్నిటినుండి వచ్చియ
చ్చో రహిమీర నంద రొకచోటున నుండుటఁ జేసి యల్ల ద
ర్బారు విచిత్ర రీతిఁ గనుపట్టెను దద్విభవంబు వర్ణనన్
మీరుచునుండెఁ జూపరకు మెచ్చొనరించుచు నన్నిభంగులన్. 535

మ. మును పందొమ్మిది నూర్ల మూడవదియై పొల్పొందు సంవత్సరం
బున, నిచ్చోటన దివ్య వైభవమునన్ బొల్పారె దర్బారు, దా
నిని నియ్యుత్సవరాజ మెల్లగతులన్ మీరెన్, గదున్ జక్రవ
ర్తినితో జార్జివిభుండు తా స్వయముగాఁ దీర్పన్ దయన్ జూపుటన్.

చ. తనరెను నాటిరాత్రి ప్రభుదర్శన నామకమైన యుత్సవం

బును, మరునాఁడు దుర్గమునఁ బొల్పువహించిన తోటయుత్సవం
బును, నల రెండువేడుకలు భూపతివర్యుఁడు కాంచె, గౌరవ
మ్మునఁదగ సత్కృతుండగుచు మోదముతోడఁ గుమార యుక్తుఁడై.

సీ. అలనెల పదునాలుగవ తేదిరాతిరి
శ్రీ జార్జి చక్రవర్తి ప్రభుండు
తనచే ననుగ్రహమును జూపఁబడినట్టి
యిన్నూటిపయి డెబ్బదేను సంఖ్య
గలవారలకు నిజకరముచే ప్రత్యేక
ముగ నయ్యాయి బిరుదముల ధరింపఁ
గాఁ జేసె నీధరాకాంతుండు గూడను
సార్వభౌముఁడు స్వహస్తంబుచేత
తే. బిరుదము ధరింపఁజేయుటఁ బరమభాగ్య
మునకుఁ బాత్రతనందె నీ యనువున నల
యుత్సవ క్రమ మెంతయు నొప్పుమీరి
నేత్రపర్వమ్ము చేయుచు నెగడెనపుడు. 538
గీ. అల్ల దర్బారులోననె డిల్లిపురము
నిండియా రాజధానిగ నేర్పరచిరి
కాన నచ్చటఁ గ్రొత్తగఁ గట్టఁబడెడు
రాజధానీ నగరికి హర్మ్యమిడఁగ. 539
క. అలచక్రేశులు తమ కర
ములఁ బదునేనవదినమునఁ బునియాదుశిలల్
నిలిపి మరుచటిదినంబున
నల డిల్లీపురమువిడిచి రనుచరయుతులై. 540
సీ. నాటిదినంబున నరపతి పయనమై
పందొమ్మిదవ తేది స్వపురి కరుగు
దెంచు నన్వార్త యాలించి, తదాగమ
నమ్ము సాయంసమయమ్మునందె

మైనచో జనులకు హర్షమ్ముతోఁ జూడ
నగునుగావున విజయనగరమ్ము
నుండియు స్పెషలుగా బండి నేర్పరచిత
దారోహణముచేసి యరుగుదేర
తే. వలయునను చును బురజనుల్ ప్రార్థనమ్ము
చేయుటయు భూమిపాలుండు స్పెషలుబండి
పయిని వసియించి బొబ్బిలిపట్టణమున
కరుగుదెంచెను సాయాహ్నమందుఁ బురికి. 541
గీ. జీసిఐయి కితాబును జెలువుమీర
గను ధరించి విభుండు దర్శనమునొసఁగ
నద్భుతానందమగ్నులై యఖిలజనులు
గాంచి రాతని గన్నుల కరువుదీర. 542
సీ. బొబ్బిలిపురిదరిఁ బోలుపారు రైలుస్టే
షనుకడఁ బథిక విశ్రమముకొఱకుఁ
గట్టించె నీధరాకాంతుండు శ్రీజార్జి
రెస్టు హౌసను పేరగృహమొకండు
పథికులువసియింపఁ బలు తెఱంగుల సుఖో
పాయముల్ గలిగియు వాతివర్ష
బాధలఁ దొలఁగించు బహువిశాలంబగు
నల విశ్రమగృహంబు నవనినాథు
తే. వరసుతుండు కుమార భూవరుఁడు తెఱచి
యల్లదర్బారు దినమున సమితిహర్ష
మొప్పఁగాఁ బ్రథమ ప్రవేశోత్సవంబు
నడపె జనములు చూచి సంతసము నొంద. 543
క. ఇల రేడు డిసంబరుతుదఁ
గలకత్తకు నేగి యచటఁ గనుగొనియె ముదం
బలరంగ రాజదంపతు

లలపురముఁ బ్రవేశ మొందు నయ్యుత్సవమున్. 544
గీ. కనిమ్మె మఱియును దత్పురమునను వసవి
'హాగపుర్ణ వేడుకయు మరి యాపయి జరి
గిన లెవీయను నుత్సవమును నరేంద్రుఁ
డధిక సత్కారపూర్వకాహ్వానమందె. 545
సీ. సకలభారత దేశ్యస ప్తమెడ్వర్డుప్ర
భుస్మృతిచిహ్నకుఁ బొసఁగ వేయి
యను, మును రాజప్రతినిధి యా మింటోప్ర
భుని ఘోషణా స్తంభమునకు వేయి
సొమ్మును, మఱియు నా సుశ్లోకు జ్ఞాపక
ద్రవ్యంబునకు సహస్రమితధనము,
లాసీప్రభువరు నిల్లాలి పేరునఁ జెన్న
పట్టణస్థాంగనా వైద్యశాల
తే. యందు శ్రీరాణి నిలిపినయట్టి శయ్య
కొనర రెండుసహస్రంబులును, నరేంద్రుఁ
డి త్తెరంగునఁ జందాల నీ సువత్స
రమున నొసఁగె నుదారతరాజిలంగ. 546
గీ. జనవరేణ్యుఁడు మూఁడులక్షలకుమీఁద
నర్థలక్షధనమ్ము క్రయమ్ము నొసఁగి
యల్ల బిరిడి జమీందారియందుఁ గొదువ
యర్థభాగము గొనియె నీ యబ్దమందు. 547
గీ. అల్ల యెస్టేటు ననుబంధమందిన బల
రామపురము సువాపల్లిగ్రామము మరి
పట్టుపురమును గొనియె నిర్వదియునైదు
వేలధనము నొసంగి భూపాలవరుఁడు. 548

1912.

సీ. పదియుఁ దొమ్మిదినూర్ల పంద్రెండవదియగు
నబ్దంబునను మార్చియందుఁ జెన్న

రాజధానికి గవర్నరయి యొప్పెడు కార్తి
కల్ప్రభుస త్తము గౌరవసహి
తమ్ముగు దర్బారు దర్శనమ్ముఁ జేసి
పరదినమున నగు బిరుదధార
ణోత్సవమ్మున నాప్రభూ త్తముదరి జీ, సి,
ఐ, యి, యన్ బిరుదుచిహ్నమగు రోబు
తే. పేరిప్రావరణమ్ము భూ విభుఁడుదాల్చి
నడిచె దానికొనల్ బట్టి నడిచి రాత్ని
పౌత్రుఁడును వేంకటగిరి భూవరుని పౌత్రుఁ
డపుడు బాలానుచరులయి నృపతితోడ. 549
గీ. అట్లుపట్టిన మనుమల కనియె విభుఁడు
నాదు రోబు ధరించి వెన్కనరుదెంచు
టిదియ కా దిట్టి రోబు ధరించుస్థితికి
రాఁగఁ బౌరుషమును స్వల్పభాగటంచు. 550
సీ. బొబ్బిలినగరికి భూనాథుఁ డేతెంచి
యల కితాబును రోబు నలరఁదాల్చి
దర్బారుమహాలులోఁ దగనొక్కనాడు సం
స్థానంపు జను లర్పితమ్ముచేసి
నట్టి మన్ననపత్ర మాదరమ్మున నంది
కొనియె నాపఖుఁ బురజనుల ప్రార్థ
నమ్ముచే నాటిదినమ్మున నల యలం
కారమ్ముతోనె దర్బారుమహాలు
తే. నందుఁబురమునఁ గలవారికందఱికిని
వీరు వారనియెడునట్టి భేద మింత
యును గలుగకుండ దర్శనమును నొసంగి
యెల్లవారలఁ దనియించె నుల్లమలర. 551
గీ. అమ్మహోత్సవమందుఁ బన్యములఁ గప్పులు

పలుపురు రచించి రందు నే వ్రాసినట్టి
వానిలోపల ముఖ్యమా పద్య రత్న
'పంచకము భక్తితో బొందుపరతు నిందు. 552

సీ. "మునుబెద్దరాయఁడో ఘనుఁడు వేంకటగిరి
వారిలోఁ బుట్టియువారిత ప్ర
తాపదీపితుఁడయి భూపతులందఱుఁ
దనచుట్టు నుండ మధ్యమున నిల్చి
వెలుగోడుపురమున శ్వేతాతపత్రంబు
బట్టించుకొనియె నప్పార్థివుండే
యీదేశ మేతెంచి యిమ్మహాసంస్థాన
మార్జించి శాశ్వత యశముఁ గాంచె
నట్టి వేంకటగిరియం దుదయించి యీ
బొబ్బిలిసంస్థానమునకువచ్చి
చెన్న రాజ్యమ్మునన్న రాజులలోనఁ
గ్రమమున ననమాన గౌరవమ్ముఁ
తే. గాంచి మించితి వహహ యిక్కారణమున్నె
యున్నతివహించి యొప్పుచు నున్ననీకు
బిరుదలాభంబు గలుగుటబ్బురమె దేవ
రమ్యగుణసాంద్ర శ్రీరంగరాయచంద్ర. 553

సీ. ఓరాజవరమున్ను యుద్ధమ్ము దీరిన
పిమ్మటఁ గ్రొత్తదుర్గమ్ము పురము
నిర్మించి రాజ్యంబు నిలిపి వేంకటరంగ
రాయభూపతి కాంచె రమ్యకీర్తి
యాతని నామమం దాదిశబ్దము నీవు
దాల్చుటఁ జేసి యాతనివిధమునఁ
గ్రొత్తకోటనుగట్టి యుత్తమమందిర
ములను బురము నూత్నముగనొసర్చి

తే. యన్ని విధముల నున్నతి నందఁజేసి
యొప్పితివి నామ సామ్య మి ట్లుండవలదె
లలిత వేంకట శ్వేతాచలపతి రంగ
రాయ భూపాల యాశ్రిత త్రాణలోల. 554

సీ. మీతాతయైన శ్రీశ్వేతాచలపతి రం
గారాయ మేదినీకాంతునామ
మును నీవు దాల్చి యాతనిభంగి నిరుపమ
దైవభక్తికిని నిధానమగుచు
నతనికాలంబున నవశిష్టములయిన
దేవాలయపుఁబనుల్ దీర్చి మఱియు
రజతవాహన దివ్యరథ సమర్పణ గోపు
రాది నిర్మాణంబు లాచరించి
తన్యరాజ్యముల యందలి భాగముల్
క్రయమిచ్చి కొని వాని రాజ్యమునకుఁ
గలిపితి మదిలోనఁ గల కోర్కు లన్నియుఁ
జక్కనిగతిఁ గొనసాగె నీకుఁ

తే. బాపురే పౌరుషమన నిప్పగిది నుండ
వలదె? తాతలకంటెను వలతినైతి
లలిత వేంకట శ్వేతాచలపతి రంగ
రాయ భూపాల విబుధ సంత్రాణశీల. 555

గీ. మున్ను మీ వంశమునఁ జన్న భూపతులకుఁ
బౌత్రముఖ దర్శనము చేయు భాగ్య మబ్బె
నట్లు వినలేదెఱింగిన యంతవట్టు
నధిప యట్టి మహాదృష్ట మబ్బెనీకు. 556

గీ. నిన్నుఁబోలిన మనుమని గన్నులారఁ
గనుచు సంతసమందు నో మనుజనాథ
యతని సుతుఁ గూడఁ గాంగిట నాదరించు

భాగ్యమిచ్చునుగాత శ్రీవరుఁడు నీకు. 557
సీ. సిరిపురమనుపేరఁ బరగునెస్టేటు ప్రొ
ప్రైటరు నిను గంటి భవ్యవంశ
భవుఁడైన రాజగోపాలరాయవిభుండు
నిజరూపమును దెల్పు నృపతి నిండు
ప్రతిమతో నెగడెడు పటము విశాఖపు
రమ్మున నిమ్మహారాజు మున్ను
కట్టించి యొసఁగిన ఘన సభాగృహమున
నిలిపెను గౌరవకలితచిత్తుఁ
తే. డగుచు నలదాని తెరను బాయంగఁ జేయు
నుత్సవంబును నడపె సముత్సుకుఁడయి
మండల న్యాయసభ యజమానుఁడగుచు
నలరు మా నీ సమాఖ్యుఁడౌ న్యాయదాత. 558
క. జనపతి యీ వత్సరమునఁ
జనియెను వేసవిదినముల జరుపుటకు ముదం
బున నీలగిరికి, మైసూ
రు నరాధీశాగ్రణియు బరోడా ప్రభుఁడున్. 559
గీ. వేసగిదినముల్ గడపఁగ వేడ్కతోఁడ
వచ్చి రచటికి నమ్మహాప్రభులతోడ
దర్శనమ్మును మరి ప్రతి దర్శనమ్ము
జరపికొని యుండె నిమ్మహీవరుఁడు ప్రీతి. 560
గీ. జీ. సి. ఐ. యి కితాబు వచ్చినకతమున
గౌరవార్థముగా విశాఖపురజనులు
రాజవర్యున కిడిరి చిత్రవంగనొక వి
నోద మల బౌనుహాలున మోదమలర. 561
గీ. స్వర్గమొందిన యెడ్వర్డు చక్రవర్తి
పేరఁ బశువైద్యశాల బొబ్బిలి పురమున

జనవిభుఁడు కట్టఁజేసి యా చక్రవర్తి
నామమున దాని బ్రకటించి నడపుచుండె. 562

క. అలదానికిఁ జెన్నపురిఁ
గల పశువైద్యోపదేశకమ్మగు విద్యా
నిలయమ్మునఁ జదివించిన
వెలమకులజు వైద్యుఁగాఁగ విభుఁడు విధించెన్. 563

క. జనపతి సిమ్లానగరికిఁ
జనిరాజ ప్రతినిధియగు జననుతు హార్డిం
గనువిభు సెప్టెంబరునెలఁ
గని యచ్చటినుండి మరలి కదలెడువేళన్. 564

క. కనుగొనియె హరిద్వారం
బును డిల్లీనగరిఁ గాశిపురము గయాప
త్తనమును గలకత్తాపురి
యును మొదలగువాని నాప్తయుతుఁడై ప్రీతిన్. 565

సీ. జననాథు రెండవతనయుఁడౌ శ్రీరామ
కృష్ణరంగేంద్రున కీ సువత్స
రము నవంబరున నిర్వదియొక్కటవతేది
కెనయు పరీధావి యనెడు చాంద్ర
సంవత్సరమ్మున శరదృతువునఁ గార్తి
కమ్మున శుక్లపక్షమున ద్వాద
శీ శుభదినమునఁ జెలువొందఁగా వివా
హమహోత్సవంబయ్యె నధికవిభవ
తే. మునను, సోదరులగు జటప్రోలు విభుఁడు
వేణుగోపాల కృష్ణ భూవిభుఁడు భ్రాతృ
పుత్రులును బావమఱదులు మొదలు పెక్కు
బంధులును మిత్రులును జూడవచ్చిరపుడు. 566

క. జనపతి పిలువగ యూరపు

యను దొరలును, వారిసతులు నయ్యుత్సవమ్ముఁ
గనుగొని యానందమునఁ
జని రీ నరనాథుచేత సత్కృతులగుచున్. 567

గీ. నరవరేణ్యుఁడు రాజాముపురిని జార్జి
కారనేషను హాలనుపేర నొక వి
హారభవనముఁ గట్టించె నచట న్యాయ
వాదులాదిగ గల పౌరవరులు కోర. 568

గీ. అల్ల రాజాము పౌరుల ప్రార్థనమున
మండల న్యాయసభ యజమానుఁడగుచుఁ
దనరు హానీ సమాఖ్యుఁడౌ ఘనుఁడు తద్గృ
హమ్ము దెరచె డిసంబరునందుఁ బ్రీతి. 569

గీ. అల డిసంబరు పదియునేనవదినము ప్ర
భాతమున శ్రీకుమార భూవరునకు జని
యించెను ద్వితీయపుత్రిక యీ శిశువున
కొనరిఁచె విభుఁడు పెంచిన జనని రాణి
లక్ష్మి చెల్లమ నామ ముల్లమ్ము చెలఁగ. 570

గీ. జీసి ఐ యి కితాబు వచ్చినకతమున
రయితుల ననుగ్రహించి భూరమణుఁడు దయ
మూఁడు వత్సరములనుండి మొనసియున్న
సిస్తుబాకీలు విడిచెఁ బ్రశస్తరీతి. 571

1913

గీ. పదియుఁ దొమ్మిదిశతములపయిఁ బదమూఁడ
శాబ్దమున బొబ్బిలికిఁ జెంత నలరు శ్వేత
శైలమున రమ్యహర్మ్యంబు జన విభుఁడు
నిర్మితముచేసె నెంతయు నిపుణరీతి. 572

ఉ. దాని ప్రవేశకార్యమును దా నడిపించె ముదంబుతోడ భూ
జాని యమాత్యు లాశ్రితులు సద్బుధులుఁ బురవాసి ముఖ్యులున్

జానుగఁదేరులన్ హయగజంబులపై వసియించి వెంటరాఁ
గా నట వర్హసత్కృతులు గైకొని యందఱు సంతసింపఁగన్. 573

గీ. రాజవర్యుండు శ్రీమహారాణితోడ
శ్రీజగన్నాథయాత్రను జేసి యచట
స్వామి దర్శనమును భక్తి పరతఁ జేసి
పరిజనముతోడ నరుదెంచె స్వపురమునకు. 574

గీ. ఎండకాలమ్ము గడప విభుండు నీల
గిరిని సకుటుంబముగనున్నతరిని లాలి
భవనమునకుఁ బ్రవేశోత్సవమ్ము జరిపి
ప్రస్తుతపు రాజధాని గవర్నరగుచుఁ
బరగువెంట్లండు ప్రభు విట్లు పలికె నపుడు. 575

సీ. "ఈ క్లబ్బుపేరిటి గృహమనునది పురు
షులకేర్పడియెనని తలఁచి నాదు
చాన రాదయ్యె నిచ్చటికిఁ, గొందఱుమాని
నులు గూడ వచ్చుటవలన నామె
రాఁజాలమికి మదిలోఁ జింతనొందెద
నిచ్చటి కామెయు వచ్చెనేని
నాతోడఁగూడ నానంద విశేషమ్ముఁ
బొందియుండును, నాదు పూర్వుఁడగు స
రార్తరులాలియన్ ఖ్యాతుఁడౌ ప్రభువు పే
రి గృహమ్మునకుంచు కొంతయును ము
దమ్ముగూరిచెనాకు, ధాగుణీ నాథుండు
పల్కినయట్టు లీ పట్టణమున
కిఁకముందు రాఁబోవునెల్ల రకంబుల
వారికీ గృహము నివాసయోగ్య
తమముగానుండు, నీసంగణేశ్వసుని యుదా
రోద్యమంబున నప్పగో త్రమునకుఁ

గలుగువారము కృతజ్ఞుల మయి యుండుట
యర్హమౌ కార్య మీ యవనివిభుఁడు
తే. నన్నుపుడు పిల్చి యీ భవనప్రవేశ
మహము జరుపుమటంచు నిమ్మయి నొసఁగిన
వెండిబీగము జాగ్రత్త వెలయనీని
జ్ఞాపకమ్ముగ నిడికొందు సంతసమున." 576
గీ. ప్రభువరేణ్యుఁడు మొదటి నిర్ణయముఁబట్టి
ముప్పది సహస్రముల నిచ్చె నిప్పనికయి
మఱియుఁ బదివేల నొకసారి మఱియు రెండు
వేల యేనూరు రూప్యముల్ విభుఁ డొసంగె. 577
గీ. కార్యనిర్వాహసభ్యతఁ గని నరేంద్రుఁ
డున్నతరి నలసభలోన నొప్పగను గ
వర్నరాదియౌ నలువురపటము లాగ్ర
హార్తమంబున బొలుపుగ నునుపఁబడియె. 578
క. నరనాథవరుఁడు సెప్టెం
బరునెలలో బయలుదేరి పరగఁగరామే
శ్వరమేగి దేవదర్శన
పరితోషమ్మును ద్వితీయవారము కనియెన్. 579
సీ. అటనుండి వచ్చెడునపుడు ట్రావెన్కూరు
కొచ్చిదేశములకు నిచ్చగదుర
నరిగి యా ప్రభువుల కతిథియై తద్దేశ
ములలోన సంచారమును సలుపుచుఁ
దద్దేశములలోన దర్శనీయములౌ వి
శేషమ్ములెల్ల దర్శించి పిదప
నా దేశములనేలు నమ్మహారాజుల
దర్శనమ్ములుఁ బ్రతి దర్శనములు
తే. జరపి సర్వవిధమ్ముల సత్కృతుఁడయి

పరిజనులతోడ నుదరాసు పురము మీఁదు
గాను బొబ్బిలి నగరికి మానవేంద్రుఁ
డరుగుదెంచెఁ దన్మాసంబు నంతమందు. 580

గీ. రాజశేఖరుఁ డి మ్మహారాణితోడ
నిరువదేనేండ్లు దాంపత్య మెలమి మీఱ
నందుటను జేసి యక్టోబరనెడు నెలను
వేడుకలు జరిగించెను విభవమలర. 581

గీ. అపుడు పదిరూప్యములకు లోనైన వేత
నములు గల్గిన వారలందఱకు నర్హ
రీతిగను వేతనములను వృద్ధిచేసె
నరవరాగ్రణి సంతోషభరితుఁ డగుచు. 582

గీ. గాట్ఫ్రిలినిథియాహార్డింగు ప్రభువు చెన్న
పురమునకు వచ్చునెడ నవంబరునెల తుద
నిమ్మహారాజు తత్పురికేగి యతని
దర్శనము చేసికొనియె నుత్సాహ మలర. 583

గీ. చెన్నపుర రాజ్యమేలుచు నున్నయట్టి
ప్రభువు పెంట్లండు వైశాఖపట్టణమ్ముఁ
జూడవచ్చిన నటఁ బౌరశుద్ధ్యసంఘ
మొక్క మన్ననపత్రంబు నొసఁగె నపుడు. 584

సీ. పురసభామందిరమునను దత్పత్రిక
గైకొని దానికి గౌరవముగ
దత్ప్రభువర్యుఁ డుత్తరము నొసంగుచు
ననియె, 'నే నీదేశమునకువచ్చి
యధికకాలమ్ముగా దైన నిచ్చటికిప్డు
వచ్చినవారిలోపలను బరిచి
తులగుగొందఱఁ గురుతులు పట్టుచున్నాఁడ
వారిలో బొబ్బిలి ధారుణీశు

తే. గురుతుపట్టుటలోన మిక్కుటపుముదము
గలదు నా కేనరేంద్రుఁడు కడు నుదార
భావమున నిప్పురమున కీ భవనమొసఁగె
నతనిపటమో యిదె యలరు' ననుచు. 585

క. అనుదెంచె బొబ్బిలికిసర్
హారోల్డుస్టూయర్టుపేరి యాంగ్లఘనుఁడు భూ
వరున కతిథియగుచు డిసం
బరు మాసంబునఁ గడపటివాసరములలోన్. 586

గీ. రాజ్యపాలన కార్యనిర్వహణసభ్య
పదము నొందినవారిలోపలను ముందు
గాను బొబ్బిలిపురమును గానవచ్చి
నట్టి మహనీయుఁ డీతఁడె యగుచునుండె. 587

1914

సీ. బొబ్బిలిసంస్థానమును మున్ను పాలించి
నట్టి మహీనాథులందు జరిత
మును బట్టి చూడ నీ భూనాథు తాత యగా
ననవద్యగుణుఁడు శ్వేతాచలపతి
రంగరాయవసుంధరా వల్లభుఁడు దీర్ఘ
తమమైనకాలమ్ము దాఁ బ్రభుత్వ
మును జేసె, నమ్మహీశునిపాలనము మించె
నీ వత్సరమ్ము పిబ్రేవరినెల
తే. యిరువదవ తేదితోఁడ, నవ్వారదినమున
నరవరేణ్యుఁ డనేకులౌ దొరలను దొర
సానలను బిల్చి కొన్నియుత్సవవిశేష
ములను నాల్గుదినమ్ములు సలిపె వేడ్క. 588

తే. ఉత్సవమ్మునకిట్టు లాహూతమైన
యతిథి బృందము సుఖముగ నరుగుదేర

విజయనగరమునుండియు స్పెషలు రైలు
బండి యేర్పాటుగావించెఁ బార్థివుండు. 589

క. సుతులిరువురుఁ బౌత్రుండును
కుతుకమ్మున వెంటరాఁగఁ గోరిచని మహీ
పతి రైలుస్టేషను న
య్యతిథులకుఁ జేయువేళ స్వాగతమొసఁగెన్. 590

సీ. తనయాజ్ఞనచట సిద్ధములైన మోటరు
బండ్లపై గుఱ్ఱపు బండ్లపయిని
నతిథులనందఱ నధివసింపఁగఁ జేసి
రాజమోహనమను రాజితమగు
నారామమునకు నింపారఁ దోడ్కొనియేగి
యట దివ్యభవనములందుఁ గొంద
ఱిని బ్రాంతదేశ నిర్మిత బహుపటగృహ
ములలోనఁ గొందఱి మోదమలర

తే. విడియఁగాఁ జేసి వలసిన వివిధ వస్తు
చయము సమకూర్చి సకలోపచారములను
దృప్తిపరుపఁగఁ దగువారి నృపవరుండు
కట్టడయొనర్చి వచ్చె నికార్యమునకు. 591

సీ. శ్రీవేణుగోపాల దేవుండు రాజిత
గరుడవాహనముపైఁ గ్రాలుచుండ
వెండియేనుఁగుపయి వేంచేసి మరి సర్వ
వాహమ్ముపయిఁ బరివార దేవ
తలు విజయముచేయఁ బలుదెరంగుల వాద్య
ములు మ్రోయఁగా మతాబులు మొదలగు
మందు సామానుల మందముగాఁ గ్రాల
కర దీపికా పరంపరలు వెలుఁగ

తే. బుగవిహారోత్సవంబును జరిపె విభుఁడు

నాటి రాత్రి, యతిథు లందఱును గోట
యందు దర్బారుమహాలుపై నధివసించి
యుత్సవముఁ గాంచి రెంతయు నుత్సుకులయి. 592

క. అమ్మరుదినమున సాయా
హ్నమ్మున నతిథులును మఱియు నవనీశ కుటుం
బమ్మున దొరలును సంతో
షమ్మునఁ దీయించుకొనిరి ఛాయాపటముల్. 593

సీ. వైభవం బలర నాపయిఁ బౌత్రునం బారి
యుత్సవంబెంతయు నొప్పుమిగిలె
నౌదాలుగట్టిన యేనుఁగులపై
నతిథులలోఁ గొందర ధివసింప
నింకను గొందఱ నిభరథంబుపయి నా
సీనులఁగాఁ జేసి క్షితివరుండు
తానుగూడను దానిపై నుండి వెడలెను
బ్రజలకు నేత్రపర్వంబుగాఁగ

తే. పంచవిధవాద్యములుమ్రోయ నంచితముగ
భటులు దేశస్థులగు జనుల్ బల్లెములను
నీటెలనుబట్టి నడువ ననేకజనము
లచ్చెరువుతోడఁ గనుఁగొని హర్షమంద. 594

క. ఆరాత్రి రాజమహాలున
నీరాజ వరేణ్యుఁ డతిథి బృందంబున కిం
పారంగ విందొసంగెను,
వారలు సంతుష్టులగు నవసరంబునకున్. 595

తే. పుత్రులను బౌత్రుఁ దోడ్కొని భూమినాథుఁ
డేగి యావిందు ముగియఁగ నిల్లుమృదుమ
ధుర వచోగుంభనసిస్త్రమై పరగునట్టి
లోక యుపన్యాస మిచ్చె సహోత్సుకమతి. 596

చ. "అతిథివరేణ్యులార! మిమునందఱ నిచ్చటఁ గూడికొంటచే
నతికుతుకంబు నామది యథార్థముగా జనియించెడిఁ దయా
మతులయి నాదు పిల్పుగొని యందఱు వచ్చుటఁ జేసి చాలస
త్కృతిమెయి వందనమ్ములను నిప్పుడు మీకిదె యేనొనర్చెదన్. 597

తే. అనఘమతులార నాదు పూర్వాధికప్ర
భుత్వకాలపు సందర్భముననె యిమ్మ
హోత్సవము సేయుటను చుమీ యుల్లమునను
దెలిసియుండెదరటంచు నేఁ దలతునిపుడు. 598

సీ. కడుఁ బురాతనమయి ప్రకాలు నీసంస్థాన
మేలె ముప్పదియు రెండేండ్లమీఁద
నేడుమాసములపై నిరుదినంబులు ప్రాజ్యుఁ
డగు మత్పితామహుఁ, డదియె వరిం
మున గమనింపఁ దగిన దీర్ఘకాలమై
యలరు నిప్పటికి, బాల్యంబు నాఁడుఁ
బదునెనిమిదినూర్లపయి నెనుబదియవ
యేట నాగస్టున నిరువ దెనిమి
దియవ దినంబుతోఁ దీరియుఁ బదునెని
మిదినూర్లపయి నెనుబదియొకండవ
యేట జూలయి పదునెనిమిదియవనాఁడు
కార్యాసనమ్మును గాంచినాఁడఁ
దత్ప్రభృతిగ గణితంబు చేసిననైన
ముప్పదిరెండబ్దములకుమీఁద
నేడుమాసములపై మూఁడుదినమ్ములు
నిన్నటితోఁడను నిండెఁగాన

తే. మిక్కిలి ప్రసిద్ధియును బెంపు మెఱయ నేలి
నట్టి నా పూర్వు నతిదీర్ఘమగు ప్రభుత్వ
కాలమును మీరుటనియెడు గౌరవంబు

గలిగె నిప్పుడు నాకు నిక్కంబుగాను. 599
తే. ఇదివఱకు బొబ్బిలీపురి నెన్నఁడేని
నతిథు లిందఱ సత్కృతి నందఁజేసి
యుంటలేదట్లుగాన నాకొదవె నధిక
మైన గౌరవ మనుమనే నాత్మఁదలఁతు. 600
తే. అదియునున్నాక గతదిన మస్మదీయ
పౌత్రు జన్మదినమ్మయి పరఁగె, నిదియు
మీకు విశదమగుచునుంట మిగుల సంత
సమ్ముఁ గలిగించు ననుచు నే నమ్మియుంటి. 601
క. ఒనరంగ నా ప్రభుత్వం
బున నాదాయవ్యయముల బోధించుటకై
యనువగుసంఖ్యల నిదె నా
తనయుఁడు వినిపించుఁ గడుముదమ్మున మీకున్. 602
సీ. ఇమ్మహోత్సవసూచకమ్ముగ ముప్పది
పయిరెండువేలు సప్త శతములును
ముప్పదియును రూప్యములు ఖర్చుచేయంగఁ
దలఁచితి, నందు భృత్యులకు వారు
చేసినసేవ కుచితరీతి నిండువే
తనము, మున్నాళ్లు వేతనము, సగ
వేతనమ్మును, పాద వేతనమ్మును, గాఁగ
బహుమతులీయఁగఁబడును, మిగిలి
తే. నట్టి మొత్తము శాశ్వతమైన యొక్క
పనికి వ్యయపెట్టఁ గలవాఁడ" ననుచుఁ బలికె
భరతఖండాధి రాజసంపతుల కపుడు
కోరె నారోగ్యమును రాజకుంజరుండు. 603
సీ. "జననుతులార! మజ్జనకుని యుత్తరు
వునను దదీయ ప్రభుత్వవిషయ

యతిథు లిరువదియవనాలుగవ దినమున
మనుజనాయకుచే ననుమతినిగాంచి
బొబ్బిలిపురమ్ము విడిచిరి మోదమునను. 605

తే. పదియుఁ దొమ్మిదినూరుల పదియు నాలు
గవసమను మార్చి నెలను షష్ఠాహమునను
శ్రీకుమార మహారాజ శేఖరునకుఁ
గలిగెను ద్వితీయసుతుఁడు సత్కళలు మెరయ. 606

తే. మార్చి నెల నిర్వదేడవ మానితదిన
మైన యానంద చాంద్రవర్షాదియందుఁ
బ్రథమపుత్రిక గలిగె శ్రీ రామకృష్ణ
రంగనరపాలవరునకు మంగళముగ. 607

తే. అంత వేసవి గడపఁగ నగ్రపౌత్రుఁ
డును మహారాణియును పిను ననుసరింప
నరిగె నేప్రిలు మాసాంతమందు సాను
యాయియై నీలగిరికి నియ్యవనివిభుఁడు. 608

సీ. ఆగస్టు మాసాదియందు యూరోపుఖండ
మున నాంగ్లసార్వభౌములకు యుద్ధ
ము ప్రసంగు సంధిగ్ధమునను నాస్ట్రియ స
ర్థాన సంబంధులై సర్వవిధము
లైన సొత్తులతోడ ననువగు సాహాయ్య
మును జేయుటకు నయి పూనియుండె
ననియును నిరువురు తనయులతోఁ గూడ
వాలంటియరుయోధ వర్గమందు
జేర నుత్సాహంబు చిత్తంబునఁ గల
దనియును యుద్ధవ్యయమ్ములకయి

తే. ప్రస్తుతమ్మొక లక్షరూప్యముల నిచ్చె
దననియును శ్రీగవర్నరు తాపునకు ధ

బురమునఁ గల జన ముఖ్యులెల్ల
సభఁ దీర్చి రందు నీ జననాథు సద్గుణ
గణములఁ గూర్చియు ఘనతరంబగు
సంస్థానపాలన చతురిమఁ గూర్చియు
సరస వాగ్రచనా ప్రశస్తములగు
వాఙ్మయంబులను సత్ప్రస్తావములను
వెలువరించిరి తగ విబుధవరులు
తే. అల్ల యుత్సవదిన శోభావహముగను
రజత గజవాహనమ్మునఁ రాత్రియందు
వేణుగోపాల విభు తిరువీధి యుత్స
వంబు గావింపఁ బడియెను బ్రమదమెసఁగ. 612
సీ. ఈరీతినర్హ సత్కారములను గాంచి
యతిథిబృందమ్ములు హర్షమంద
దానమానమ్ము లనూనమ్ముగాఁ గొంచు
బంధుభృత్యులు గడుఁ బ్రమదమంద
భక్తిసంయుక్త సద్వర్తనంబున రాజ
సార్వభౌములు చాల సంతసిల్ల
సత్పరిపాలన చాతుర్యమునుజూచి
సరినరాధీశు లచ్చెరువునంద
తే. పుత్రులును పౌత్రులును బరిపూర్ణ భక్తిఁ
గొలుచుచుండఁగ నానందకలితుండగుచు
లలితవేంకటశ్వేతాచలపతి తగ
నరవరేణ్యుఁడు వెలయుచున్నాఁడు నేఁడు. 613
క. శ్రీరామకృష్ణదేవులు
రారాజద్భక్తిపూర్ణ రంగారాయ
తస్మాగమ బుని సకుటుంబము
గా రక్షించెదరుగాతఁ గరుణాన్వితులై. 614

క. ఆచంద్రతారకంబయి
యీచరిత గ్రంథరాజ మెసఁగుతను, జయ,
శ్రీచతురవేంకటశ్వే
తాచలపతి రంగరాయ యార్యనుగేయా. 615

గ్రంథోత్పత్తి.

సీ. శ్రీరావు వేంకట శ్వేతాచలపతి రం
గారావ నీ నాథుని యాజ్ఞచేత
శ్రీ బొబ్బిలీరాజ సింహుల చరితంబు
పద్యరూపముగ నేర్పడ రచించి
పదియుం దొమ్మిదినూర్ల పదునాలుగవ వత్స
రమునం దొమ్మిదవ మాసము ద్వితీయ
మగునాఁటి సోమయుగు నానందవర్షాశ్వ
యుజ్మాస శుక్లత్రయోదశి బుధ
తే. భాసురమున సన్నిధి సమర్పణము చేసె
భక్తి నాస్థానకవియయి పరగు నంచె
లేములకుల సీతారామ భూమిసురుఁడు
వెలయుఁ గావుత నిది సర్వ విభుఁడిదియును. 616



PRINTED BY R. VENKATESHWAR & CO. AT THE ANANDA PRESS, MADRAS.

# తప్పొప్పుల పట్టీ.

| వరుస నంబరు. | పుట నంబరు. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 16 | ఒకింతయు | ఒకంతయు |
| 2 | 18 | శితీరు | శీతీరు |
| 3 | 72 | గడిపిన | గడపిన |
| 4 | 72 | వయు: | పదియొ |
| 5 | 81 | నెలను | నెల |
| 6 | 84 | పార్షి మంప | నంపమంగ |
| 7 | 86 | లంవర | లంవరు |
| 8 | 88 | సత్నిధి | సన్నిధి |
| 9 | 92 | నాం ప్తిహిల్ | నాం త్తిల్ |
| 10 | 102 | మిఛ్చి | మిచ్చి |
| 11 | 102 | డారించుట | డావరించుట |
| 12 | 103 | నెలనై వ | నెలనునై |
| 13 | 103 | పదినమ్మనం | పదినమం |
| 14 | 135 | స్వల్ప | సల్ప |
| 15 | 147 | మతులయి | న్వితులయి |
| 16 | 147 | యుంవరు | యుంవరు. |